

చిలకలపూడి పాండురంగ దేవాలయము

—ఫొటో: డి. ఎస్. అంబూరావు-మద్రాసు.



# వంటిల్లు—కీటకములు

మీ వంటింట్లో మీరు అనుకొనేకంటె ఎక్కువ కీటకములు ఉండవచ్చును. అవి ఆహార పదార్థములను ముట్టుకొని మీ ఆరోగ్యమునకు హాని కలిగించవచ్చును. కీటకముల బాధ లేకుండా ఉండుటకు మీ వంట సామానులు పెట్టుకొనే షెల్ఫులు మరియు బీరువాలను ఎల్లప్పుడూ శుభ్రముగా ఉంచుకొంటూ వాటిలో క్రమంగా ఫ్లిట్‌ను జల్లండి. ఒక సారి ఫ్లిట్‌ను జల్లిన చోట్లకు కీటకములు ఎన్నో రోజుల వరకు చేరనే చేరవు!

ఫ్లిట్ శాస్త్రరీత్యా తయారు చేయబడే కీటకనాశిని. దానిలో డి.డి.టి., లిండేన్ మరియు థానైట్ మొ॥ ఆరు శక్తివంతమైన కీటకనాశినులు ఉండుట వలన అది యింటివద్ద ఉండే అన్ని కీటకములను నాశనము చేయును. ఎల్లప్పుడూ ఒక డబ్బా ఫ్లిట్‌ను మీ యింట్లో ఉంచుకోండి!

ఫ్లిట్...దొరకుతున్న కీటకనాశినులలోకెల్ల అత్యుత్తమమైనది




ఫ్లిట్
స్టానోవాక్
వారిచే మార్కెట్
చేయబడుతున్నది

స్టాండర్డ్ — వాక్యూమ్ ఆయిల్ కంపెనీ
(యు.ఎస్.ఎ.లో సంస్థాపితము; కంపెని సభ్యుల బాధ్యత పరిమితము)

సంవత్సర చందా
రు. 13-0-0
విడిప్రతిక 25న.పై

# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక

సంపుటము 52
సంచిక 37
7-5-58

Founder : K. NAGESWARA RAO

విలంబి వైశాఖ బహుళ చతుర్దీ బుధవారం

##  విషయానుక్రమణిక 

★

ముఖచిత్రం :

హిందీనటి మధుబాల


## రమ్యమైన ఉద్యానవనం


# బెంగుళూరు లాల్‌బాగ్


కె. సుబ్బరామప్ప


మైసూరు చూడవచ్చినవారు బెంగుళూరిలో దిగకపోరు. అక్కడ దర్శనీయమైన స్థలాల్లో లాల్‌బాగ్ ఒకటి. అందులో విహరించి ఆనందించిపోవని వారెవరూ వుండరు. ఆవరణంలో ప్రవేశించిన తర్వాత యెంతసేపువున్నా విడిచిపోవడానికి మనసురాదు. అక్కడి సుందరమైన దృశ్యాలు, రంగురంగుల పూలమొక్కలు, పండ్లతోటలు, అలంకారముగా కత్తిరింపబడ్డ పొదరిండ్లూ, కమానులు తీర్చిదిద్దిన విద్యుద్దీపాలు, జలయంత్రాలు, విహారకేంద్రాలూ వీనికితోడు హాయినిచ్చే వాతావరణం–ఒకటేమిటి గడ్డిపోచనుంచీ పెద్దచెట్టుదాకా చూడ రెండు కళ్ళు చాలవు. ఇది కేవలం విశ్రాంతికిగాను యేర్పాటైన ఉద్యానవనమేకాకుండా అనేక సస్యజాతుల భాండాగారంకూడా అయింది.


ఉద్యానవనంలో తీర్చిదిద్దిన మార్గాలు


లాల్‌బాగ్‌లో అంటుకట్టిన రకరకాల మొక్కలు—వెనుక భాగంలో డా॥ సుందరరావుగారిని చూడవచ్చు

నూరు సంవత్సరాలనుంచీ అభివృద్ధికి వచ్చిన యీ "కెంపుతోటకు" మనోహర ఉద్యానవనానికి గత ఏడాది శతమానోత్సవం జరిగింది. ఆగస్టునెల 15 దాకా యిది నందనోద్యానమై విద్యుద్దీపకాంతిలో మెరిసిపోతూ లక్షలాది జనాన్ని ఆకర్షిస్తుంది. గత స్వాతంత్ర్య దినోత్సవంనాడు మరింత వేడుకగా ఉద్యానవన శతమానోత్సవం జరిగింది.

ఈ లాల్‌బాగ్ పుట్టుపూర్వోత్తరాలలో చరిత్ర యిమిడివుంది. బెంగుళూరు నిర్మాత కెంపేగౌడ, హైదరాలీ, టిప్పుసుల్తానులు, బ్రిటిష్‌వారి సామ్రాజ్యంలో తెల్లదొరలూ, మైసూరు సంస్థానాధీశులూ దీన్ని అతి గారాబంతో పెంచి పెద్దచేశారు.

మైసూరు సంస్థానంలో ఉద్యానవనాల తోటల పెంపకానికి ఈ లాల్‌బాగ్ మూలకేంద్రం జనసామాన్యానికి అందుబాటులో వుంటూ ఆనందమయ జీవితానికి తోడుగ ఈ సుందరవనం యేర్పడింది మొక్కల యొక్క పరిశోధనక్షేత్రం కావడంతో వృక్ష శాస్త్రాన్ని అభ్యసించే విద్యార్థులు నేర్చుకోదగ్గ అంశాలిక్కడ అనేకం



జాజ్ సంగీతానికి నవ్యరీతులలో రూపకల్పనచేసిన డేవ్ బ్రూబెక్, ఆయన బృందం ఎడమినుంచి: జో మారెల్లో (తప్పెటవాద్యగాడు) డేవ్ బ్రూబెక్ (పియానో); పాల్ డెస్మాండ్ (శాక్సొఫోన్); నార్మన్ బేట్స్ (తంత్రీవాద్యం) వీరు గత మాసం మద్రాసులో కచేరీలు జరిపారు.

# అమెరికన్ జాజ్ సంగీతం

సంగీతం. ఇది స్వచ్ఛమైన నీగ్రో సంగీతం. పాడటానికి చాల తేలికగా ఉంటుంది. ఈ సంగీతం భావోద్రేక ప్రకటనమే లక్ష్యంగా కలిగినదయినందున మనోభావాలతోపాటు, సంగీత రీతికూడా మారిపోతుంటుంది.

జాజ్ సంగీతం నిత్య నూతనంగా ఉంటుంది. కాలక్రమేణా కొన్ని కట్టుబాట్లు దీనిలో ఏర్పడుతున్నప్పటికీ ఈ లక్షణం మాత్రం అట్లానే ఉంటూవచ్చింది. ఇది దీనికి ముఖ్య లక్షణం కూడాను. జాజ్ గాయకుణ్ణి అని చెప్పుకొనే వాడెవడూ కూడామరొకణ్ణి అనుకరించడు. ఎవరికివారు ఎప్పటికప్పుడు కొత్త బాణీలను అన్వేషిస్తూ ప్రదర్శిస్తుంటూనే ఉంటారు.

జాజ్ సంగీతంలో ఇటువంటి విశృంఖలత్వంవల్ల అప్పుడప్పుడూ కొంత చెడుగు జరిగినమాట నిజమే. స్వేచ్ఛపేరిట కొంత చౌకబారు సరుకు ఇందులో ప్రవేశించిన మాటకూడా నిజమే. ఇది చాల సకృత్తుగానే జరిగింది. ఎక్కువ సందర్భాలలో జాజ్ సంగీతకులు తమకుగల స్వాతంత్ర్యాన్ని సద్వినియోగమే చేసుకొన్నారు. దానికి అర్హుల మనిపించుకున్నారు. వారి చాతుర్యం, వారి ఉపజ్ఞ 'జాజ్'ను సుసంపన్నమైన సంగీతంగా, మరింత ప్రజానురంజకమైన కళగా చేయటానికి తోడ్పడినవి.

జాజ్ సంప్రదాయంలో నిబంధనల బంధాలు లేకపోవటం వల్లనే భారతీయులలోనూ దీనికెంతోమంది భక్తులు, ప్రియులు లభించారు. భారతీయ సంప్రదాయంలో కూడా కళాకారుడికి ఉండవలసిన స్వేచ్ఛకే ప్రాముఖ్యం ఉన్నది.

"జాజ్" అనేది విశాలమైనది. ఇందులో న్యూ ఆర్లియన్సు, డిక్సిలాండ్, రాగ్టయిమ్, బాప్, కూల్‌జాజ్. ప్రోగ్రెసివ్ జాజ్ అని అట్లా అనేక రకాలున్నవి. తరచు ఈ సంగీతపు స్వింగ్, "పాపులర్" గీతాల చేరువకు కూడా విస్తరిస్తుంటుంది. ఈ విభిన్న రీతులు జాజ్‌ను మరింత సంపన్నం చేయటానికి తోడ్పడినవి. వీటిలో కొన్ని కొంతవరకే తోడ్పడి ఉండవచ్చు. మరికొన్ని ఎక్కువగా ఉపయోగపడి ఉండవచ్చు. మొత్తంమీద ఇవన్నీ కలిసి జాజ్ సంగీతాన్ని ఇప్పుడది ఉన్న బృహత్ రూపానికి తెచ్చినవి. ఒకనాడు జాజ్‌ను ఛీదరించుకోటంలో కొంత సబబుకూడా ఉండకపోలేదు. మరి ఈనాడు ఆపరిస్థితి కనపడదు. కనపడటానికి అవకాశం లేదు. జాజ్ ఎంతో అభివృద్ధి చెందింది. రసికులైనవారికి నవ్యరసాస్వాదనావకాశం లభింపజేస్తున్నది స్ట్రావిన్‌స్కీ, హిండ్‌మిత్ వంటివారిని సైతం తనవంకే



ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్
నూతన అధ్యక్షుడు
శ్రీ పిడతల రంగారెడ్డి

ఫలవృక్షాలనూ సేకరించడం, మొక్కల పెంపకంలో కావలసిన వైజ్ఞానిక సాహిత్యాన్ని తయారుచేసి, ప్రచారం చేసి గృహోద్యానాల అభివృద్ధికి తోడ్పడడం, తోటపనిలో ఆసక్తి వుండే వారికి తరిఫీదు ఇవ్వడం, ప్రజానీకంలో సౌందర్యకళను అభివృద్ధి చేసుకోవడానికి ఉద్యానవనాలు పెంచేటట్టు ప్రోత్సహించడం, పోటీలు జరిపి బహుమతులివ్వడం జరిపిస్తూ వచ్చారు.

లాల్ బాగ్ పర్యవేక్షకుల్లో మొటమొదట విలియం న్యూ (1858 - 1864) నియమింపబడ్డాడు. పిమ్మట జాన్ క్యామరాన్ (1864 - 1908) జె. హెచ్. క్రుంబీగల్ (1908 - 1932) నేడు డాక్టరు మరిగేడ - వీరంతా లాల్ బాగ్ అభివృద్ధికి మిక్కిలి శ్రమించారు. ఈ తోటలో అత్యాకర్షణీయంగా కనుపించే "గ్లాస్ హౌస్" (అద్దాలమందిరం) 1890 లో నిర్మింపబడింది. ఇందులో ప్రసిద్ధవ్యక్తులు రాష్ట్రానికి వచ్చినప్పుడు సన్మానాలు, తోటవిందులు యీ గ్లాస్ హౌస్ లో యేర్పాటుచేస్తారు. మనదేశ నాయకులకే కాక మనదేశానికి వచ్చి మైసూరు చూడవచ్చిన విదేశీయ ప్రభుత్వ అతిధులకంతా అక్కడే విందు చేసేవారు. మార్షల్ టిటో, బుల్గానిన్, కృశ్చేవ్, అరేబియా రాజు, ఇథియోపియా రాజు, ఇరాన్ రాజదంపతులు, నేపాల్ రాజదంపతులు మొదలైనవారంతా చూచి ఆనందించిన నందనోద్యానం యిది.

ఈ ఉద్యానవన శతసంవత్సర చరిత్రలోని ఉత్తరార్థంలో దీనిని మిక్కిలి శ్రమకోర్చి అభివృద్ధికి తెచ్చింది జి. హెచ్. క్రుంబీగల్ దొర. ఈ తోటలో యిప్పుడు కనుపించే సుందరమైన ప్రాచ్యా గార్డెన్స్, జపాన్ గార్డెన్, ఎకనామిక్ గార్డెన్, లోటస్ పాండ్ (పద్మసరోవరం) నిర్మించింది ఆ దొరే. ఈ తోట వనకోలవుండే కెంపేగౌడ మంటపందగ్గిర రాతిబండలపైన ఒకనీటి రిజర్వాయర్ నిర్మించి చెరువునీటిని దీనికి పంపు చేయించి పైపులద్వారా తోటకు నీరు సరఫరాచేయించారు. ఆర్థికదృష్టినుంచీ కూడా ఉపయుక్తమయ్యే అనేక దేశవిదేశీయ మొక్కలను, కాటను, ఫంటను తెప్పించి నాటించి పెంచాడు. లాల్ బాగ్ విస్తీర్ణము ఈనాడు విపరీతంగా పెరిగింది. సుమారు 240 యెకరాలవరకు వ్యాపించింది. డాక్టరు మరిగేడ యీ తోటను సక్రమమైన రీతిని పెట్టడానికి అందచందాలతో అలరారేటట్టు ఆకర్షణీయకంగా కనిపించడానికి మిక్కిలి శ్రమిస్తున్నారు. ఈ తోట సలహాసమితి సభ్యుడు. డాక్టర్ డి. సుందరరావుగారు కూడా తోట అందచందాలకు తోడ్పడుతూ వచ్చారు. వీరు తెలుగువారు.

ఈ లాల్ బాగ్ పక్షి సంగ్రహాలయం కూడా అయింది, అనేకలతలు, మూలికలు, వనస్పతులు, గంభీరాకృతిలో వుండే వెదుళ్ల రకాలు, రంగురంగుల గులాబీలు, పువ్వు జాతులూ సేకరించబడ్డాయి. పూర్వం దీనికి ఆనుకొని ఒక మృగాలయం (జూ) వుండేది. ఇప్పుడు దాన్ని మైసూరికి మార్చారు. ఇక్కడ పరంగి, వేరు, జామ, సపోటా, అనాస, అంజూర, మొదలైన ఫలవృక్షాలూ, క్యాబేజ్, ఫూల్‌కోసు, బీన్సు, నూల్ కోల్, టొమాటో, బంగాళాదుంప, టర్నిప్, మొదలైన కూరగాయల్లో పరిశోధనలు చేస్తూ ఉత్తమజాతులను తయారుచేస్తున్నారు. మనదేశంలోని కళాశాలల్లో వృక్షశాస్త్రం చదివే విద్యార్థులు జట్లు జట్లుగావచ్చి వైజ్ఞానిక దృష్టితో యిచ్చట కొన్నాళ్ళుండి చూచిపోతారు. ప్రతి ఆదివారమూ కొంతమంది విద్యార్థులకు యిచ్చట ఉద్యానవన పోషకంలో శిక్షణ యివ్వబడుతూ వుంది.

ఈ లాల్ బాగ్ యొక్క సౌందర్యంతో ప్రతిస్పర్ధకు నిల్వగలిగిన ఉద్యానవనాలు చాల తక్కువ అని చెప్పవచ్చు. ఇచ్చటి పుష్పసంపద, లతానికుంజాలు, బారులుతీరి గగనాన్ని చుంబించే సరుగుడు చెట్లు, పచ్చిగడ్డి పరుపులు, తీర్చిదిద్దిన కంచెలూ దారికిరువైపులా శోభాయి చెప్పే భటులువలె దిరిసిల్లిన పాలచెట్లూ, ఒకటేమిటి ఇవన్నీ చూస్తే స్వర్గం నుంచీ దిగివచ్చిన "చైత్రరథమా!" అన్నట్టు ఆకర్షణీయంగా వుంటుంది.



లాల్ బాగ్ లోని దానవాళపు పువ్వును డా॥ సుందరరావుగారు చూపిస్తున్నారు

# త్యాగం

[డాక్టర్ రావు (ఎం. బి. బి. ఎస్.) గారి ఇల్లు. గోడకు బుద్ధుని పటం వ్రేలాడుతుంది. మధ్యలో డ్రాయరూ, రెండు మూడు కుర్చీలు వుంటాయి. డ్రాయరుమీద కొన్ని పుస్తకము లుంటాయి. డ్రాయరుకు పైగా Dr. రావు, M. B B. S. అను బోర్డు వుంటుంది. తెర ఎత్తేసరికి అయిదారుమంది నిలబడి లోపలివైపు తీవ్రంగా చూస్తూ వుంటారు. వారిలో వారికి గుసగుస లారంభమవుతై.]

*　　*　　*

1 వ వాడు : ఏం కనపటం లేదు!

5 వ వాడు : నాకూ అంతే.

1 వ వాడు : ఉస్ ! ఎమిటీ గోల?

2 వ వాడు : ఉస్ ?

3 వ వాడు : ఉస్ !

6 వ వాడు : ఉస్ లేదు, గిస్ లేదు. ఏమైనా ఆశవుందా ?

1 : అడుగో ! నౌకరు వెంకన్న.

2 : వాణ్ణే అడుగుదాం.

(వెంకన్న వచ్చి డ్రాయరుపై వున్న అగ్గిపెట్టె తీసుకువెడుతుంటాడు)

1 : వెంకన్నా ! వెంకన్న !!

వెం : ఉస్ ! శబ్దం చేయకండి. (అంటూ లోనికి వెడ్తాడు.)

6 : లాభం లేదల్లేవుంది. మంత్రాల గురవయ్య వస్తే బావుండును.

1 : మనిషిని పంపించాం.

7 : (ఆత్రుతగా ప్రవేశించి) ఏమిటీ జనం ? ఏమైంది?

1 : పాము కరిచింది.

7 : ఎవరికి ?

2 : డాక్టర్ గారి అబ్బాయి ప్రసాద్ గారికి.

3 : పాపం ! ఒక్కగా నొక్క కొడుకు.

4 : M.A. ఫస్టులో పాసయ్యాడు.

5 : మొన్నే ఢిల్లీకూడా వెళ్ళివచ్చాడు.

7 : ఎందుకు ?

6 : ఉద్యోగానికి !

1 : ఏం ఉద్యోగమో యేమో ! ఈ గండం గడవాలిగా ?

2 : ఉస్ ! అడుగో కంపౌండరు.

(కంపౌండరు ప్రవేశించి ఇంజెక్షన్ ట్యూబుకోసం వెతుకుతుంటాడు)

1 : మన స్పృహలో వున్నాడా, కంపౌండరుగారూ ?

కం : ఉంటే ఇంకేం ! ఒక్క మందూ పనిచేయు లేదు. ఇక్కడే పెట్టా అది ఇప్పుడు కనపటం లేదు.

(లోపలునుంచి 'కంపౌండర్' అన్న కేక)

కం : కనపళ్లేదు డాక్టర్ !

(డాక్టర్ ముచ్చెమటలతో ఆదుర్దాగా వస్తాడు. డ్రాయరులోని కాగితాలన్నీ తీసి పారేసాడు. కావలసిన ఇంజెక్షన్ ట్యూబు దొరుకుతుంది. లోపలినుంచి తాను తీసుకువచ్చిన సిరంజి నీడిల్ ను ఆ ట్యూబులోనికి గుచ్చుతాడు. ఆసమయంలో ఒక టెలిగ్రాఫ్ ప్యూను వస్తాడు.)

టె. ప్యూ : good morning sir, మీకు టెలిగ్రాం వచ్చింది.

(డాక్టర్ కంపౌండరుకు సైగ చేస్తాడు. కంపౌండరా టెలిగ్రాం దస్కతుచేసి తీసుకుంటుండగా డాక్టర్ లోపలికి వెడ్తాడు. కంపౌండరు టెలిగ్రాంను బల్లపై వేసి డాక్టర్ దగ్గరకెడ్తాడు. అందరూ తీవ్రంగా చూస్తుంటారు)

1 : ఎక్కడనుంచో టెలిగ్రాం ?

2 : ఎవరో ఇచ్చుంటారు !

3 : ఆయన చూసుకోలేదేం ?

4 : ఈ గణ్ణం గడవనీ.

(లోపలనుంచి విచారసూచకంగా బ్యాక్ గ్రౌండ్ మ్యూజిక్ ఆరంభం. రంగంపైనుంచే జనమంతా ఒక్క అడుగు ముందుకు వేసి తీవ్రంగా చూసుంటారు. బ్యాక్ గ్రౌండ్ మ్యూజిక్ పై స్థాయి కెళ్తుంది. లోపలనుంచి డాకర్ డాకర్ అన్న కేకలు వినపడతాయ్. బ్యాక్ గ్రౌండ్ మ్యూజిక్ అకస్మాత్తుగా ఆగిపోతుంది. రంగంపైవుండే వారంతా ఒకరి ముఖా లొకరు చూచుకుంటారు. వెంకన్న కన్నీళ్లతో ప్రవేశించి పైగుడ్డతో కళ్లొత్తుకుంటాడు. అందరూ వెంకన్నను చూస్తారు)

1 : ఏమయిందో?

వెం : అయిపోయింది. పోయింది ప్రాణం!

(జనమంతా అయ్యో, అయ్యో, ఆహా అంటారు)

1 : డాక్టరుగారికి రావలసిన కష్టం కాదిది.

2 : నాకు తెలిసినంతవరకు ఈ జన్మలో ఆయ నే పాపం చేయలేదు.

3 : మృత్యువుకు దయుంటుందిటయ్యా ?

1 : అదుగో డాక్టరుగారు.

(డాకర్ కాళ్ళీడ్చుకుంటూ నిర్జీవప్రతిమలాగా మెల్లగా అడుగులు వేసుకుంటూ వచ్చి కుర్చీలో కూలబడ్డాడు)

1 : ఎంత కష్టం వచ్చింది బాబు !

2 : అన్ని కష్టాలు మంచివాళ్ళకే వస్తయి!

3 : ఎన్ని వందల ప్రాణాలో కాపాడిన డాకరుగారి హస్తవాసి యీ నాడు వారి స్వవిషయంలో పనికిరాకుండా పోయింది !

7 : పిలిపించవలసిన వారెవరైనా వుంటే టెలిగ్రాం యిద్దురూ ?

2 : ఎవరొచ్చి ఏం చేస్తారు ?

6 : ఆ గురవయ్య వస్తే మంత్రమన్నా వేసేవాడు.

(పై మాటలు జరుగుతుండగా కంపౌండరు టెలిగ్రాం చింపి చూస్తాడు. టెలిగ్రాం చదివి)

కం : (దుఃఖముతో ) టెలిగ్రామండి ఢిల్లీ నుంచి. (డాక్టర్ తల పైకెత్తి చూస్తాడు. కంపౌండరు చదువుతాడు)

Dr. Rao, Vijayawada,

Your son is selected on a salary of Rs. 1000 per mensem. Send him immediately.

SECRETARY,
Finance Department, Delhi.

(డాకర్ టెలిగ్రాం తీసుకుని చూస్తాడు. లేచి వెళ్ళి లోపలికి చూస్తూ)

డా : నాయనా ప్రసాద్ ! నీకు టెలిగ్రాం వచ్చిందోయి. నీకు ఉద్యోగం వచ్చింది. నిన్ను వెంటనే రమ్మంటున్నారోయి. లే! త్వరగా వెళ్లు ప్రసాద్ లే! వెళ్లవేం ప్రసాద్ ! కళ్లు తెరు ప్రసాద్. ప్రసాద్ ! (అంటూ ఆవురుమంటాడు)

(కంపౌండరు అక్కడవుండే ఇద్దరు పెద్దమనుష్యులూ వెళ్ళి డాకర్ను పట్టుకుని తీసుకువచ్చి కుర్చీమీద కూర్చోపెడ్తారు) ఇంతలో ఒక మనిషి చెయ్యి పట్టుకుని గుడ్డి గురవయ్యను రంగంపైకి తీసుకువస్తాడు.)

7 : గురవయ్యబాబూ! అయిదు నిముషాలు ముందర వస్తే డాక్టరుగారి కొడుకు బ్రతికేవాడుగదా?

గు : అంతా రామునిదయ. మందేముంది.

2 : ప్రాణం పోయి అయిదు నిముషాలే అయింది.

గు : అంతా రాముని దయ.

3 : ఇంకా ఏమైనా ఉపయోగముందంటావా?

4 : మంత్రం వేస్తారా?

గు : అంతా రాముని దయ. నీళ్ళు తెప్పించండి.

(జనమంతా ఒకరి మొఖమొకరు చూచుకుంటారు)

1 : పోయి నీళు తీసుకురా వెంకన్నా.

వెం : (లోనికి వెళ్లును)

7 : (గురవయ్యతో) డాక్టరుగారి ఇల్లు నిలిపావో నీకెంతో పుణ్యముంటుంది.

4 : అది మా అందరిని బ్రతికించినట్లే.

(వెంకన్న నీళ్ళు తెస్తాడు)

గురవయ్య నీళ్లతో పుక్కిలించి ఉమ్మేస్తాడు. చేతులు కడుగుకుంటాడు. ఒక మూలగా కూర్చొని చేయి త్రిదండం పెడుతూ)

గు : రామయ్య తండ్రీ అంతా నీదయ. ఏం చేసినా సరే! నేను వట్టి నిమిత్త మాత్రుణ్ణి (జపంచేస్తుంటాడు కంపౌండరు, డాకరు తప్ప మిగిలిన వారంతా తీవ్రంగా లోపలికి చూస్తుంటారు. బ్యాక్ గ్రౌండ్ మ్యూజిక్ ఆనంద సూచకంగా ఆరంభమవుతుంది. అందరూ ఇంకా తీవ్రంగా చూస్తూ వుంటారు. Back Ground Music ఒక వున్నత స్థాయికెళ్తుంది.)

1 : (ఒక్క గంతువేసి) కదిలాడు!

2 : బ్రతికాడు!

డా : (లోపలికిచూచి పరుగున వెడాడు.) (కాంపౌండరుకూడా వెంబడిస్తాడు).

1 : (గురవయ్య దగ్గరకొచ్చి) గురవయ్య బాబూ! విషం విరిగింది. అబ్బాయి కదిలాడు.

గు : అంతా రామునిదయ!

7 : అబ్బాయి లేచి కూర్చున్నాడు.

6 : ఒక్క క్షణంలో ఎంత మార్పు జరిగింది!

2 : ఆయన మంత్రంలోని మహిమ అటువంటిది.

4 : ఆనాడు పాముల నరసయ్య, ఈనాడు మంత్రాల గురవయ్య మన దేశంలో దేవుళ్లలాగా వెలిశారు.

5 : అంతా రామునిదయే!

1 : ఉస్ : వుండండి.

(డాకరు తనకొడుకును పట్టుకు తీసుకువస్తాడు. ప్రసాదును కుర్చీలో కూర్చొ పెట్టి స్టెతస్కోపుతో హృదయాన్ని పరీక్ష చేస్తాడు. నాడిని, నోటిని, కళ్లను పరీక్ష చేస్తాడు. అమితానందతో గురవయ్యను చూచి దగ్గరకొచ్చి నమస్కరిస్తూ.)

డాకరు : బాబూ...ఆనందంలో మాటలు పెగలవు. లోనికి పరుగెత్తుకుంటూ వెళ్తాడు. అందరు డాక్టరువైపు చూస్తుంటారు. డాకరు లోపలనుంచి రెండునోట్ల కట్టలను తీసుకువచ్చి.)

డా: మీరు చేసిన యీ మహోపకారానికి కృతజ్ఞతను ఎలా తెలపాలో తెలియటంలేదు. మీరు నిజంగా నాపాలిటి దైవస్వరూపులు.

గు: నాది దైవస్వరూపమా బాబూ?

డా: సందేహమా! మీ శక్తి అద్వితీయం! అమోఘం!! మెడికల్ సైన్సునే తారుమారు చేశారు! మీ మహత్తర మంత్రశక్తిని గురించి ప్రపంచానికంతా చాటుతాను.

గు: చాటి?

డా: అదృష్టం అందరికి లభ్యమయ్యేటట్లు చేస్తాను.

గు: ఎందుకు బాబు, మీకంత శ్రమ? మీ అబ్బాయి మీకుదక్కాడు. అది చాలదూ?

డా: నేను స్వార్థపరుణ్ని అనుకున్నారా నా విషయం మీకు తెలియదు.

గు: మిమ్మల్ని తెలియకపోవటమేం? బాగా తెలుసు.

డా : అయితే సంతోషం. నా కృతజ్ఞతను ఈవిధంగా తెలుపుకుంటున్నా దయచేసి ఈ డబ్బును తీసుకొని నన్ను సంతోష పెట్టండి. (డబ్బును చేతికిస్తాడు.)

డా : ఎంతిచ్చినా మీరు చేసిన మహోపకారానికి సరిపోదని నాకు తెలుసు. అయినా కాదనకుండా యిప్పటికిది స్వీకరించండి.

గు : ఇది యెంత డాక్టరుగారూ?

డా : రెండు వందలు.

గు : రెండు వందలే!

డా : మీరు కాదనకుండా సంతోషించాలి.

గు : మీ అబ్బాయి బ్రతికినందుకు మీరు సంతోషించారు. ఈ రెండు వందలతో నన్ను సంతోషించమంటారు. అంతే నా డాకరుగారూ?

డా : అందరూ సంతోషించటమేగా మన ఆశయం. ఇందులో తప్పేముంది?

గు : సంతోషం — ఆశయం మాటలు మీరంటుంటే నాకేదో వింతగావుంది!

డా : కారణం?

గు : చెప్పి ప్రయోజనం?

డా : చెప్పకపోతే కలిగే ప్రయోజనం? మీ మనస్సులో ఏదో వుంది. అదేమిటో చెప్పండి. ముందు కూర్చోండి. వెంకన్నా! ఆ కుర్చీ యిలా వేయి.

(వెంకన్న కుర్చీ తెస్తాడు)

గు : క్షమించండి డాకరుగారూ! ఈ శరీరం కుర్చీలమీద పెరిగింది కాదు. మీరు కూర్చోండి.

1 : కూర్చో గురవయ్యా!

2 : డాక్టరుగారి మాట కాదనకు.

వెం : జరిగిందేదో జరిగింది. జ్ఞాపకం తెచ్చుకోకండి గురవయ్యగారు.

గు : ఎవరామాటంది?

వెం : నేను—వెంకన్నను.

గు : ఇక్కడ ఉద్యోగం మానుకుంటానన్నావుగా?

వెం : ఏం సేయమంటావ్ మామా. పొట్టగడవక గడి తింటున్నా.

డా : ఏమిటీ మాటలు? ఇదంతా యేదో నాటకంలాగా వుంది. నీకు నెల తిరిగేప్పటికి 20 రూపాయిలు జీతం యిస్తుంటే అది నీకు

## ★ త్యాగం ★

గడ్డిగా కనపడుతుందేం?

గు: క్షమించండి డాక్టరుగారు, అతగాడికి రూపాయిల విలువ తెలియక యేదో అన్నాడు – డాక్టరుగారూ! మీ కెంత మంది పిల్లలు.

డా: ప్రసాదొక్కడె.

గు: ఒక్కగానొక్క కొడుకు. మీ సర్వస్వం ఆ ఒక్క కొడుకే కదు?

డా: అవును.

గు: మీ అబ్బాయి కోసం ఏమైనా త్యాగం చేస్తారు కదు?

డా: అర్థం లేకుండా ఏమేమో అంటున్నారు. కన్న సంతానంపైన ప్రతి తండ్రికి వుంటుంది ప్రేమ.

గు: అందరిమాటా వేరు. మీ విషయం వేరు. మీకు మాత్రం మీ అబ్బాయి మీద వుండే ప్రేమ చాల విలువైంది. ఆ విలువెంతో మీకే తెలుసు.

డా: అంటే?

గు: చెప్పమంటారా? డాకరుగారూ! మీ అబ్బాయిమీద మీకుండే ప్రేమకు విలువ రెండువందల రూపాయిలు. కోప మొచ్చిందా డాక్టరుగారూ?

డా: రెండువందలంటే మీకేదో తమాషాగా వుందన్నమాట?

గు: నిజం చెప్పారు. డాక్టరుగారూ! ఆ రెండు వందలేగా నన్నీ స్థితికి తెచ్చిందీ, ఈ ప్రపంచమంతా శూన్యం చేసింది! ఈ రెండు వందలే ఆనాడు నా చేతుల్లో వుంటే నా జీవితమే మరోలాగ వుండేది.

డా: డబ్బుకోసం ఆరాటపడటం బాధపడటం సహజం.

గు: నిజమే బాబు! అది మీకు సహజంగా కనపడుతుంది. పది లక్షలున్న వాడు పదకొండో లక్షకోసం, కటిక దరిద్రుడు కడుపుకు గంజికోసం బాధలుపడుతుంటాడు. ఇద్దరూ పడేది బాధే. కన్క అది సహజంగానే కనపడుతుంది మీకు.

డా: ఆమాటలన్నీ ఇప్పుడెందుకు. మీ బాధ లేమన్నా వుంటే చెప్పండి. చేతనైన సహాయం చేస్తాను.

గు: నా బాధ ఆ దేముడే తీర్చాలి.

డా: లోపలికి రండి. మీకళ్లు పరీక్ష చేసి చేతనైన సాయం చేస్తాను.

గు: వద్దు బాబు వద్దు! నన్నిట్లాగే వుండనివ్వండి.

డా: కారణం?

గు: ఈ స్వార్థ ప్రపంచాన్ని మళ్లీ చూడలేను.

డా: అంటే?

గు: మీకు నిజంగా వినాలని వుందా

డాక్టరుగారు?

డా: చెప్పండి.

గు: అయిదేండ్ల క్రిందట మీ దగ్గర కొచ్చాను, మీరు మరచిపోయి వుంటారు. అప్పుడు యీ కళ్లకు చూపుండేది. మీ కాళ్లా వేళ్లా పడి ప్రార్థించాను. నా కొడుకును యెలాగైనా బ్రతికించమని. వాడికి సన్నిపాతం వచ్చింది; సంధి పుట్టింది; కొందరు ఆశ లేదన్నారు - కొందరు బతుకుతాడన్నారు. మీ హస్తవాసి మంచిదని, మీరొచ్చిచూసి మందిస్తే బతుకుతాడని ఎవరో అన్నారు నా భార్యతో! మిమ్మల్ని తీసుకురమ్మని బలవంత పెట్టింది - అప్పుడు మీ దగ్గరకు పరుగెత్తుకుంటూ వచ్చాను.

డా: అవును. వచ్చావు. నేను అడిగిన రెండువందలు యివ్వలేవు. నేను రాలేదు.

గు: ఆసంగతే వెళ్లి చెప్పాను నా భార్యతో! హృదయం. బద్దలయ్యేటట్టు ఏడ్చింది- తనతల బాదుకుంది-రక్తంతో ఒళ్లంతా తడిసిపోయింది. నేనేం చేసేది? నాచేతుల్లో రెండువందలు కాదు రెండు అణాలు కూడా లేవే? ఇంట్లోకి వెళ్లాను. మా చిట్టెయ్య కళ్ళు తెరిచాడు. దగ్గరకు వెళ్లి మీద చెయ్యి వేశాను. పెదిమలు కదిలాయ్. మాట్లాడటానికి ప్రయత్నించాడు. స్పృహవస్తున్నది. బతుకుతాడని నమ్మకం కలిగింది. పలుకరించాను. "ఏమిటి నాయనా" అని సమాధానం చెప్పాడు.

డా: ఏమని?

గు: "డాక్టరుగారు వచ్చారా" అని.

డా: అయ్యో! తరువాత యేమైంది? బతికాడా ఇంతకూ?

గు: ఆ! బతికాడు ఆ రాముడి దయవల్ల! అదేనాకు మిగిలిన ఆనందం.

డా: అతనిప్పు డెక్కడున్నాడు? ఏం చేస్తున్నాడు?

గు: (పైకి చూపుతూ) అడుగో! అక్కడ వున్నాడు. వాడితల్లితో ముచ్చట లాడుతున్నాడు.

డా: మరి బతికాడని చెప్పావుగా!

గు: చెప్పాను. బతికింది నీకుమారుడు. నీకు నీళ్ళు వదల వలసిన కుమారుడు. నీవంశాన్ని నిలబెట్టవలసిన కుమారుడు. నీవార్ధక్యంలో నీగొంతులో యిన్ని నీళ్లు పోయవలసిన కుమారుడు.

దయా దాక్షిణ్యము లేని —నిరుపేదలకు దిక్కులేని క్రూర ప్రపంచంలో నాకొడుక్కి - ఒక్కగా నొక్క కొడుక్కి స్థానమే కరువైంది. భూమికి భారమైనాడు! వాడు కళ్ళుమూశాడు! వాడితోపాటు నాకళ్ళూ పోయినాయ్! నేను చావలేక బతికున్నాను. నాబిడ్డ చిట్టెయ్యతోపాటు ఆనాడే పోయివుంటే నాకిబాధ లేకపోయేది.

డా: గురవయ్యా నీవు పొరబడ్డావు. నీకుమారుడు పోలేదు. చనిపోలేదు. బతికే వున్నాడు.

గు: ఎగతాళి కూడా చేస్తున్నారా డాక్టరుగారూ?

డా: నిజమే. ఎగతాళి, అహంకారం, దురాశ, కాఠిన్యం అన్ని అనాలో నే వుండేవి. ని గురవయ్యా! ఆ డాక్టరు చనిపోయాడు—నీ కుమారుడు సజీవిగా వున్నాడు. దగ్గరకు తీసుకుంటావా? కాదనకుండా అంగీకరిస్తావా?

గు: అంతకంటె భగవంతుణ్ణి కోరేదేముంది? ఎక్కడున్నాడు నాబాబు? ఏడీ నా చిట్టెయ్య? రా నాయనా! రా, నాదగ్గరగా రా! నాకు చూపు లేదుగా. నువ్వే దగ్గరకు రావాలి! యీ గుడ్డితండ్రిని కౌగలించుకో! చిట్టెయ్యా! చిట్టెయ్యా!!

డా: ఇడుగో నీ చిట్టెయ్య. (అంటూ తనకొడుకు నిస్తాడు.)

(జనంలో గుసగుసలు)

గు: (చేత్తో తాకి పరీక్షించి) డాక్టరుగారు ఇతడు నా చిట్టెయ్య కాడు. నిజం చెప్పండి! ఎవరబ్బాయో చెప్పండి.

డా: ఇంతవరకూ నా కుమారుడు. ఈ క్షణంనుంచి నీకుమారుడు.

గు: డాక్టరుగారూ, తలకుమించిన త్యాగం చేస్తున్నారు. బాగా ఆలోచించి చెపుతున్నారా యీ మాటలు?

డా: ఆలోచించికాదు. అనుభవించి చెబుతున్నా! త్యాగమంటె ఏమిటో ఇప్పుడర్థమయింది. ఇక పరమార్థం ఎలాంటిదో తెలుసుకోటానికి ప్రయత్నిస్తాను. అది ఊరువిడిచికాదు. వూళ్లోవుండే! మానవుల జబ్బులతో వ్యాపారం చేస్తున్న నా డాక్టరుతనానికి స్వస్తిచెప్పాను. ఈనాటినుంచి భగవత్ప్రసాదితమైన నా వైద్యధర్మాన్ని ఉచితంగా నిర్వహిస్తూ దరిద్ర నారాయణుల సేవతో తరిస్తాను. నా మాట కాదనకండి. నాకు కళ్ళున్నాయి. నా పని నేను చూచుకుంటాను. నీకు ఇతర్ల సహాయం కావాలి. ఈ నాటినుంచి ప్రసాదు మీ చిట్టెయ్య. బాబూ! ప్రసాద్! ఇందాక ఒక టెలిగ్రాం వచ్చింది, గవర్నమెంటు దగ్గరనుంచి, నీకు ఉద్యోగమిచ్చామని. అది గవర్నమెంటు యిచ్చిన ఉద్యోగం. ఇది భగవంతుడిచ్చిన ఉద్యోగం. ఈ మహనీయుని సేవించి తరించు.

ప్రసా: (గురువయ్యతో) రానాన్న.

గు: నాన్న? ఎవరది పిల్చింది. చిట్టెయ్యా ఓ చిట్టెయ్యా!

ప్రసా: అవును. నీ చిట్టెయ్యను (అంటూ దగ్గరకొస్తాడు.)

గు: "చిట్టీ" (అంటూ కౌగలించుకుంటాడు) డాక్టరు ఆనందంగా చూస్తూ వుంటాడు. గురవయ్యను ప్రసాదు తీసుకువెడ్తాడు. డాక్టరు చూస్తూ వుంటాడు.)

1: ఏం త్యాగం! ఏం త్యాగం!

2: త్యాగం అంటే ఆ గురవయ్యదే!

8: కాదులే! త్యాగమంతా డాక్టరుగారిదే!

2: ఎట్లా అవుతుంది? అపకారానికి ఉపకారం చేశాడు గురవయ్య. ఆయన త్యాగమే మెచ్చుకోవాలసింది.

4: నీ బొంద. త్యాగమంటే అర్థం తెలుసూ నీకు?

2: నీకు తెలిసి చచ్చా!

4: నోర్మూయి! పళ్లూడ కొడాను!!

2: (ఫెడీమని నాలుగవవాని చెంపపై కొడ్తాడు. ఇద్దరూ కొట్టుకుంటారు. డాక్టరు దగ్గరగా వస్తాడు. వాళ్ళమాటలు క్రమంగా తగిపోతయి. అంతా నిశబ్దం. డాక్టరువెళ్ళి గోడకు వేళ్ళాడుతుండే బుద్ధుని విగ్రహానికి నమస్కరిస్తాడు. అందరూ నమస్కరిసారు. బ్యాక్ గ్రౌండ్ మ్యూజిక్ వినబడుతుంది.)

[తెర పడుతుంది.]

పరా: [అన్ని హక్కులు రచయితవే! ప్రదర్శనానికి వారి అనుమతి పొందాలి. అడ్రసు: ముదికొండ లింగమూర్తి, 12 నానారావువీధి, త్యాగరాయ నగరం, మద్రాసు-17.] 






# రహస్య పత్రాలకు రక్షణే పోయింది!

భారతదేశంలో ప్రజాస్వామ్యం దినదినాభివృద్ధి పొందుతోంది. ఇటీవల జరిగిన భారత రెడ్‌క్రాస్ సంఘం, సెంట్ జాన్ అంబ్యులెన్స్ వార్షిక సమావేశం ఇందుకొక చక్కని ఉదాహరణ. రెడ్‌క్రాస్ సంఘం వారి కార్యక్రమంలో ఇలా ఉంది:—

"1958-59 వ సంవత్సరానికి రెడ్‌క్రాస్ సంఘపు కార్యవర్గం ఈ క్రింది రీతిగా పునర్నిర్మిత మవుతుంది.

1. రాజకుమారి అమృతకౌర్‌ను అధ్యక్షురాలుగా రాష్ట్రపతి నామినేట్ చేసారు.

2. రాష్ట్రపతి ఈ దిగువ పేర్కొన్న వారిని సభ్యులుగా నామినేట్ కార్యవర్గ సభ్యులుగా నామినేట్ చేస్తారు:

కాబోయేవారి అయిదుగురి పేర్లు ఇక్కడ వరసగా ఇవ్వబడినవి.

3. "ఈ క్రింది వారిని సభ్యులుగా సెలెక్టు చేసుకోవలెనని శ్రీ కె. వై. భండార్కర్ ప్రతిపాదిస్తారు; లెఫ్టినెంట్ జనరల్ బి. చౌధురి బలపరుస్తారు." అని అలా సెలెక్టు చేసుకోవలసిన ఆరుగురి పేర్లు వరసగా ఇవ్వబడినవి.

4. "రాబోయే సంవత్సరానికి సెంట్ జాన్ అంబ్యులెన్స్ కార్యవర్గ అధ్యక్షురాలుగా రాజకుమారి అమృత్ కౌర్‌ను రాష్ట్రపతి నామినేట్ చేస్తారు."

వార్షిక నివేదికను, జమా ఖర్చులను సమావేశానికి నివేదించుతామని కార్యక్రమంలో ఉంది, వాటిని సమావేశానికి నివేదించాలనీ, సమావేశం వాటినిచర్చించాలనీ, రెడ్‌క్రాస్ సంఘనియమాలలో ఒక నిబంధన ఉన్నప్పటికీ, సమావేశం వాటిని ఆమోదించేదీ లేనిదీ కార్యక్రమంలో పేర్కొననే లేదు.

వార్షిక సమావేశం జరుగుతుందని నెల రోజులు ముందుగా పత్రికలలో ప్రకటన చేయాలని సంఘ నియమావళిలో మరొక నిబంధన ఉన్నది. అలాంటి ప్రకటన ఒకటి—1958 ఏప్రిల్ 31 సోమవారము నాడు సమావేశం జరుగుతుందని మార్చి 28 వ తేదీనాడు ఒక కలకత్తా పత్రికలో వెలువడింది. అంతకుముందు ఒక ప్రకటన సమావేశం ఏప్రిల్ 21 న జరుగుతుందని వెలువడింది.

ఉద్యోగ నిబంధనావళిలో 7-వ నిబంధన ప్రకారము (2-వ పేజీ) ఉద్యోగులు విధిగా రిటైరు కావలసిన వయస్సు 60 సం॥లు" అని ఉన్నది. కాని వాకబు చేయగా, రెడ్‌క్రాస్ సంఘములోని కొందరు ఉన్నతాధికారులు ఇటీవలే 67-వ జన్మదినోత్సవం కూడా జరుపుకున్నట్లు తెలిసింది.

శ్రీ కృష్ణ
[ ఆంధ్రపత్రిక ప్రతినిధి ]

ప్రధాన కార్యాలయం నిర్వహణకు రూ 2,19,973 వ్యయం అయింది. ఈ వ్యయంలో కొన్ని అంశాలు :

| | | |
|---|---|---|
| 1. జీతాలు, భత్యాలు | రు | 1,67,650 |
| 2. ప్రావిడెంటు ఫండుకు గాను | రు | 14,106 |
| 3. ప్రయాణ ఖర్చులు | రు | 1,923 |
| 4. సిబ్బందికి వైద్యం ఖర్చు | రు | 1,468 |
| 5. ప్రయాణపు కన్సెషన్లు | రు | 184 |
| మొత్తం...... | రు | 1,85,331 |

* * *

శ్రీ మొరార్జీ దేశాయి ఆర్థికమంత్రి పదవి స్వీకరించటం, స్థానిక పత్రికలలో "అతి రహస్య" పత్రాలు ప్రచురితం కావటం ఒకేసారి జరిగాయి. ఈ "అతిరహస్య" పత్రాలలో 1958 సెప్టెంబరు 30 తో ఆఖరయ్యే 6 నెలలకూ వేసిన విదేశీద్రవ్యం బడ్జెట్ వివరాలుకూడా ఉన్నాయి. చిత్రమేమిటంటే లోగడ యూజిన్ బ్లాక్ ఉత్తరాన్ని ప్రచురించిన కొన్ని పత్రికలను దుయ్యబట్టిన పత్రికే ఇప్పుడీ "అతిరహస్య" పత్రాలను బయట పెట్టింది. యూజిన్ బ్లాక్ ఉత్తరం ప్రచురింప కూడనంత రహస్య పత్రమేమీ కాదు. కాని ఇప్పుడీ పత్రిక బయటపెట్టిన విదేశీ ద్రవ్యం బడ్జెట్ అధికార వర్గాలు చెప్పే దాన్ని బట్టే చాలా రహస్యమైనదట. వీటి ప్రచురణను "స్కూప్" అని మనం అనుకోవాలన్నమాట. శ్రీ ఫిరోజ్ గాంధీ ఒకసారి ఒక రహస్య పత్రంలోంచి బహిరంగంగా కొన్ని వాక్యాలు పేర్కొన్నప్పటినుంచీ రహస్య పత్రాలకు రక్షణ పోయినట్టేగనుక, ఇప్పుడీ విదేశీ ద్రవ్యం బడ్జెట్‌ను బయట పెట్టిన పత్రికపై ఏ చర్య తీసుకోటానికి వీల్లేదన్నమాట.

శ్రీ గాంధీమీదగాని, ఆ పత్రికమీదగాని చర్య తీసుకోవాలని కాదు నా అభిప్రాయం. పత్రిక ఆ సమాచారాన్ని బయటపెటటం 'రిపోర్టింగ్' లో చురుకుతనానికి నిదర్శనమే. కాని అటువంటి చురుకుతనమే ఇతర పత్రికలు చూపినప్పుడు, ఈ పత్రిక గొడవ లేవదీయకుండా ఉండాలనే కోరేది.

ప్రభుత్వ పత్రాలమీద "అతి రహస్యం" (టాప్ సీక్రెట్) అని వ్రాయటం ఊరికే చూసి సంతోషించటానికో, అలంకారార్థమో కాదని కొత్తగా పదవిలోకి వచ్చిన అనుభవ శూన్యులైన మంత్రులు గ్రహించాలి. "అతి రహస్యం" అని వ్రాసిన పత్రాలను గోప్యంగా ఉంచాలనే అలా వ్రాస్తారు. అటువంటివి బయటపడటం ప్రధానమంత్రికి అంత ఇష్టం ఉండదు. అధికార రహస్యాలను బయటపెట్టే అలవాటున్న మంత్రులను 'కాబినెట్' లోంచి తొలగించటం కూడా లోగడ జరిగింది.

* * *

 

# న్యూఢిల్లీ లేఖ



గ్రాంటుల డిమాండ్లమీద జరిగిన సుదీర్ఘ చర్చను ఒకసారి సింహావలోకనం చేద్దాం. ఈ చర్చ ఏదో కళ్ళు తుడవటానికన్నట్లు జరపటం ఒక అలవాటైపోయింది.

ప్రతిశాఖ గ్రాంటుల డిమాండ్లను చర్చించి వోటు చెయ్యటానికి కొన్ని రోజులను నిర్ణయించుతారు. న్యాయంగా ఆర్థిక మంత్రే డిమాండ్లను ప్రతిపాదిస్తారు. చర్చ లేవదీయటానికి వీలుగా కోత ప్రతిపాదనలు ప్రవేశ పెట్టబడతాయి. అసలు విధానాన్ని విమర్శించటానికిగాని, వ్యయం తగ్గింప జేయటానికిగాని ఈ కోత ప్రతిపాదనను ప్రవేశ పెడతారు. పొదుపు చెయ్యటంమీద ఏ సభ్యుడికీ అట్టే శ్రద్ధలేదు గనక, అసలు విధానాన్ని విమర్శించేందుకోసమే కోత ప్రతిపాదనలు ప్రవేశపెట్టటం మామూలైంది. ఈ ఏడాది చర్చలు మందకొడిగా ఉన్నా కొంత తమాషాగా ఉన్నాయి. దీన్ని కొంచం వివరిస్తాను.

గత ఫిబ్రవరి 28 వ బడ్జెట్‌ను ప్రవేశ పెట్టిన తరవాత కేంద్ర మంత్రివర్గంలో కొన్ని మార్పులు చేశారు. ఈ మార్పుల ఫలితంగా శ్రీ మురార్జిదేశాయి వాణిజ్య, పరిశ్రమలశాఖ డిమాండ్లనేగాక, ఆర్థిక శాఖ డిమాండ్లనుకూడా ప్రతిపాదించారు. శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి, తన తరవాత రవాణాశాఖ మంత్రి కాబోయే శ్రీ ఎస్. కె. పాటిల్‌ను ఇరకాటంలో పెట్టేవిధంగా మాట్లాడారు. నీటిపారుదలశాఖ మంత్రిగా పదవీ విరమణచేస్తూ, శ్రీ పాటిల్ ఆహారోత్పత్తి ఎందుచేత తగ్గిపోయిందో చాలా చక్కగా వెల్లడించారు. ఒకళ్ళతో ఒకళ్ళు సంబంధం లేకుండా పనిచెయ్యటం, ఒకళ్ళు చేసినపనే మరొకళ్ళు చేయటం దీనికి కారణాలని ఆయన తెలిపారు.

డా॥ కలూలాల్ శ్రీమాలి లెక్కలేనన్ని కొత్త స్కీములు ప్రకటించి సభ్యులచేత సాధువాదాలు చేయించుకొన్నారు. ఈ స్కీముల్లో చాలామటుకు గాలిమేడలేనని పలువురు భావిస్తున్నారు.

మొత్తంమీద వ్యయం తగ్గించాలనే ప్రయత్నం అటు ప్రతిపక్షంకాని, ఇటు ప్రభుత్వ పక్షంకాని చెయ్యలేదు. దేశాన్ని పీడిస్తున్న అనర్థాలనుగూర్చి శ్రీ పాటిల్ చెప్పిన విషయాలను విశదీకరించవలసిందని ఎవరూ ఒత్తిడి చేయలేదు. ఒకశాఖచేసేపనే మరొక శాఖ చేస్తూవున్న పక్షంలో బోలెడు వృథా వ్యయం జరుగుతూ వుండి ఉండాలి. అలా జరగకుండా చేయాలని ఎవరూ ఒత్తిడి చెయలేదు. మరి ఈ చర్చల వల్ల జరిగిన లాభమేమిటి?

ఆర్థిక శాఖ డిమాండ్లపై చర్చ జరుగుతున్న సమయంలో, పరిపాలనా వ్యయం నానాటికి ఎక్కువైపోతున్నదనే విషయం ప్రస్తావనకు వచ్చింది. ఆర్థికమంత్రి ఇలా సమాధానం చెప్పారు: "మేము వ్యయం తగించాలని ప్రయత్నిస్తూనే ఉన్నాము. ఏవేవో సంఘాలను నియమిస్తూనే ఉన్నాము. ఈ విషయమై పరిశీలన జరపటానికి ప్రత్యేకంగా ఒక డివిజన్‌ను ఏర్పాటు చేశాము. ఎక్కడెక్కడ ఉద్యోగులను తగ్గించటానికి వీలుంటుందో, ఎక్కడెక్కడ పరిపాలనావ్యయం తగ్గించవచ్చునో పరిశీలిస్తున్నాము. అనతి కాలంలోనే ఏదో కొంత సాధించి చూపగలమని అనుకుంటున్నాను. నాకు ఈ శాఖతో పరిచయంలేదు. అందుచేత ఇది చేయగలను, అది చేయగలను అని వెంటనే స్పష్టంగా చెప్పలేను. పైగా ఈ విషయం ప్రభుత్వపు సమష్టి బాధ్యత. ఈ బాధ్యతలో నా భాగం నేను నెరవేర్చగలనని, అనవసరమైన వ్యయాన్ని అరికట్ట గలమనీ, వృథా వ్యయాన్ని పూర్తిగా నివారించగలమని మాత్రం చెప్పగలను. అందుచేత ఈ విషయాన్ని పరిశీలిస్తున్నాము. ముందు నేను నా శాఖతో మొదలు పెట్టాను. ఎంతవరకూ ఫలితాలు సాధించగలనా అని పరిశీలిస్తున్నాను."

వ్యయం తగ్గింపు ప్రయత్నాలు ప్రభుత్వపు సమష్టి బాధ్యత అని ఆర్థికమంత్రి చెప్పినదాన్ని ముఖ్యంగా గమనించాలి. ఎందుకంటే ఎవరేమి చెప్పినా ప్రధాన మంత్రి చెప్పిందే ఆఖర్న నెగ్గుతుంది.

ప్రభుత్వ కార్యాలయాలను ఢిల్లీనుంచి వివిధ ప్రాంతాలకు మార్చాలనే ప్రతిపాదనను పదేళ్ళుగా కేంద్ర ప్రభుత్వం సమష్టిగా పరిశీలిస్తోంది. ఈ మధ్య కొన్ని నిర్ణయాలు చేశారు. వీటిని ఎప్పుడమలు చేస్తారో తెలియదు. ఈలోగా ప్రభుత్వ భవనాలు కొన్ని కోట్ల రూ. ల విలువైనవి శిథిలమైపోతున్నాయి. వీటి భారమంతా పడేది పన్నులు చెల్లించే ప్రజలమీదే. ఇది ఇలా ఉండగా కొన్నివందలకోట్ల రూ. లు ఖర్చు పెట్టి, ముఖ్యంగా న్యూఢిల్లీలో, నానాటి పెరిగిపోతున్న ప్రభుత్వోద్యోగులకోసం భవనాలు కడుతున్నారు. ఎంప్లాయిమెంటు ఎక్స్ఛేంజీలు ప్రకటించే లెక్కల్నిబట్టి నెలానెలా ఉద్యోగులసంఖ్య పెరిగిపోతోందని తెలుస్తుంది. ఎంప్లాయిమెంట్ డైరెక్టరు జనరల్ ప్రకటన ప్రకారం రైల్వేలలో కాకుండా మిగతా, కేంద్రప్రభుత్వ శాఖల్లో ఉన్న సివిలియన్ ఉద్యోగుల సంఖ్య 1951 డిసెంబరులో 5,90,562 నుంచి 1957 డిసెంబరులో 6,89,271 కి పెరిగింది. అంటే 7 ఏళ్ళలో 98,709 మంది ఉద్యోగులు ఎక్కువయ్యారన్నమాట. 1957 డిసెంబరుతో అంతమైన 12 నెల్లోను 6,74,134 నుంచి వారిసంఖ్య 6,89,271 వరకూ పెరిగింది. అసలు ఈ పెరుగుదల ఎక్కువగా గుమాస్తాల సంఖ్యలోనే కనిపిస్తుంది. 1951 డిసెంబరులో 1,42,850 నుంచి 1957 డిసెంబర్‌లో 2,32,029 వరకూ వీరిసంఖ్య పెరిగింది. అంటే ఏడేళ్ళలోనూ 89,179 మంది గుమాస్తాలు ఎక్కువయ్యారన్నమాట. 1957 డిసెంబరుతో అంతమైన 12 నెల్లోను గుమాస్తాల సంఖ్య నెలకు దాదాపు 1270 చొప్పున పెరిగింది.

ఆర్థికమంత్రి ముందు తమ శాఖతో మొదలు పెడతామన్నారు. ఇది చాలా ముదావహమైన పని. కేంద్రమంత్రివర్గం ఇప్పుడెంత ఉన్నదో అంతతో ఆపుచేయాలని ప్రథమ చర్యగా ఆయన కోరాలి. తరవాత ఒక్కొక్క శాఖలోను ఎంతసిబ్బంది, ఉంటే చాలుతుందో నిర్ణయించాలి. మాజీ ఆర్థికమంత్రి శ్రీ చింతామణి దేశ్‌ముఖ్ ఆర్థికశాఖలో ఏర్పాటుచేసిన ఒక సంఘం, ఏయే శాఖలో ఎంతెంత సిబ్బంది ఉంటే సరిపోతుందో కొన్ని నివేదికలు తయారుచేసి చూపించింది. అయితే ఎక్కువగా ఉన్నారనిపించిన ఉద్యోగులను తొలగించి వాళ్ళని నిరుద్యోగులని చెయ్యాలని కాదు నా అభిప్రాయం. ఈ అదనపు ఉద్యోగులను అలానే ఉంచి ముందుముందు సిబ్బందిని వృద్ధి చెయ్యాలనుకున్నప్పుడల్లా వీరిలోనుంచి తీసుకుని నియమిస్తే సరిపోతుంది. కేంద్ర ప్రభుత్వంలో పనిచేసే గుమాస్తాలలో కనీసం నూటికి 33 వంతుల మందయినా అదనంగా ఉంటున్నవారేనని మాజీ కార్మిక మంత్రి ఒకాయన ఒకసారి చెప్పారు.

అలాగే వృథావ్యయాన్నిగూర్చి కూడా సవివరంగా పరిశీలించవలసిన అవసరం ఎంతయినా ఉంది.






"శ్రీ రాగి"

అర్ధరాత్రి. గాఢాంధకారం. కన్ను పొడుచుకొన్నా కనపడటంలేదు. ఆకాశంలో తారకలు ప్రకాశిస్తున్నై. అది హైదరాబాదులో అల్లకల్లోలంగావున్న రోజులు. హైదరాబాదు స్టేటులోని హిందువులంతా ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని బ్రతుకుతున్నారు. హైదరాబాదు స్టేటుమీద భారత ప్రభుత్వం పోలీసుచర్య మొదలు పెట్టింది. ఇంకా స్టేటంతా భారతసైనికుల అధీనంలోకి రాలేదు. రజాకార్లు ఎక్కడ చూసినా చెలరేగుతున్నారు.

అటువంటిరోజుల్లో ఒకనాటి అర్ధరాత్రి విజయవాడనుంచి సూర్యారావు పేటకుపోయే రోడ్డుమీద ఓ అంబులెన్సు కారు అతి వేగంగా పోతున్నది. దానిలో ఉన్నవారు ఇద్దరే యిద్దరు: డ్రైవరు, ఫైరుసర్వీసు మాన్ ఆనందరావున్నూ. వాళ్ళిద్దరూ ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని ప్రయాణం సాగిస్తున్నారు. అంబులెన్సు సుమారు యాభైఅరవై మైళ్ళ వేగంలో పోతున్నది. వాళ్ళిద్దరూ ఏమీ మాట్లాడుకోటంలేదు. వారి దృష్టి అంతా తమ కర్తవ్య నిర్వహణమీదే కేంద్రీకరించబడివుంది.

అంబులెన్సు నందిగామ గ్రామం దగ్గరలో వున్న కేసరి బ్రిడ్జిని సమీపించింది. అక్కడ సాయుధ పోలీసులు బ్రిడ్జికాపుదల కోసం ముకాంచేసి, గస్తీ తిరుగుతున్నారు. బ్రిడ్జికి అవతలా, ఇవతలా కూడా. ఆ బ్రిడ్జి ఓ చిన్న నదిమీద కట్టబడింది. షుమారు వంద అడుగుల పొడవు వుంటుంది. సాయుధ పోలీసులు కాపున్నారు. బ్రిడ్జికి ఇవతలఉన్న సాయుధపోలీసుగార్డులు అంబులెన్సుఆపివేశారు. వాళ్లనుఎలాగోతృప్తిపరచి అంబులెన్సును బ్రిడ్జి దాటించాడు ఆనంద రావు. బ్రిడ్జికి అవతల సాయుధ పోలీసుల కమాండరు కారును చూడగానే ఆపించాడు. భయపడుతూ, అగ్నిమాపకదళ పోలీసు ఆనందరావు కారు దిగి కమాండరు దగ్గరకు వచ్చి నిలబడ్డాడు.

"ఈ కారు ఎవరిది?" అన్నాడు కమాండరు.

"ఫైర్ సర్వీస్ అంబులెన్సు సార్. మద్రాసుప్రభుత్వమువారిది" అన్నాడు వణుకుతూ ఆనందరావు.

"ఎక్కడినుంచి వస్తున్నారు?"

"విజయవాడనుంచి వస్తున్నాము"

"ఎక్కడికి పోతున్నారు?"

"సూర్యారావుపేట ఆస్పత్రినుంచి ఇద్దరు రోగులను తీసుకురమ్మని విజయవాడ ఎడిషనల్ డిస్ట్రిక్ట్ మెడికల్ ఆఫీసరుగారు మాకు వుత్తర్వు లిచ్చారు."

"భారతప్రభుత్వం ప్రత్యేక ఉత్తర్వు లేనిదే ఈ సరిహద్దు దాటటానికి వీల్లేదు అని తెలీదూ?" కమాండరు కఠినస్వరం ఆ అర్ధరాత్రి ప్రతిధ్వనించింది.

ఆనందరావు కమాండరు గర్జనకు వణికాడు. జేబులోనుంచి విజయవాడ ఎ. డి. యం. వో. గారి ఆర్డరు కాగితం తీసి కమాండరుకు చూపించాడు.

"ఈ ఆర్డరు చూడండి సార్. మా డ్యూటీ మేము నిర్వర్తించటానికి బయలు దేరాము. మీరు పోవటానికి వీల్లేదంటే ఇక్కడే వుండిపోతాము. ఎ. డి. యం. వో గారిని వైర్‌లెస్ ద్వారా అడిగి కనుక్కోండి. తర్వాతనే మేము ఇక్కడనుంచి కదులుతాము" అన్నాడు ఆనందరావు.

కమాండరు ఆనందరావు ఇచ్చిన కాగితం చూసుకొన్నాడు. దానిలో ఆనందరావు చెప్పినట్లుగా ఉల్లేఖించ బడివుంది. క్రింద విజయవాడ ఆసుపత్రి ఎ. డి. యం. వో సంతకం వున్నది. కమాండరు ఆలోచనలో పడ్డాడు. మఫ్టీలోవున్న ఆనంద రావునూ, డ్రైవరునూ చూసి కమాండరువాళ్లు రజాకారుల ముఠాలోని వాళ్ళేమోనని అనుమా



"వహ్వా! ఇంతవరకు పోలికలు బహు చక్కగావచ్చాయి!"



"భలేవాడే! మన షాపులో చేరక ముందు గుర్రాలకు, ఎద్దులకు నాడాలుకొట్టే పనిచేసే వాడన్నమాట!"

# ★ ఆనాటి రాత్రి ★

నించాడు మొదట. అంబులెన్సు కాడీమీద వున్న రెడ్ క్రాసూ, మద్రాసు ప్రభుత్వం పేరూ చూసి, ఆనందరావు ఇచ్చిన కాగితం చూసే తన అనుమానం నిజంకాదని తెలుసుకొన్నాడు. తర్వాత ఆయన తాను నిర్వర్తించవలసిన విధినిగురించి ఆలోచించాడు. యాభై అరవై వేలు ఖరీదుచేసే ఆ అంబులెన్సు కారును ఇద్దరు నిరాయుధులైన, అల్ప వయస్కులైన అగ్నిమాపక దళం వారిచేతుల్లో వదలి పంపించటం ప్రమాదమని భావించాడు.

ఆనందరావు యువకుడు. పాతికేళ్ళు నిండవు. అందంగా చలాకీగా వుంటాడు. డ్రైవరుకు ముప్పయ్యేళ్ళు వుండచ్చు. అంత దృఢకాయుడు గాదు. ఆనందరావు కమాండరు అర్ధక్షణం నిరీక్షిస్తున్నాడు. కమాండరు ఆనందరావును చూసి ఇలా అన్నాడు. "ఇలా ఒంటిగా మీ రిద్దరూ ఈ అర్ధరాత్రి పోవటం చాలా ప్రమాదకరం. నేను ఇద్దరు సాయుధ పోలీసులను నీకు రక్షణగా పంపిస్తాను. వాళ్ళు నువ్వుచెప్పినట్లు నడుచుకొంటారు. తిరిగి వచ్చేటప్పుడు వాళ్లను ఇక్కడదించి మీరుపోవచ్చును. వీళ్లకు ఒక రివాల్వరుకూడా ఇస్తాను. అవసరంవచ్చినప్పుడు అదినువ్వు తీసుకొని వాడు. ఇదిగో ఈ 'విజిల్' నీ దగర వుంచుకో. దారిలో రజాకార్లను ఎదుర్కోటం సంభవిస్తే, అవసరం అని తోచినప్పుడు నువ్వు విజల్ వూదితే సాయుధపోలీసులు తమ ఆయుధాలతో రక్షణ కుపక్రమిస్తారు. వెళ్ళి సురక్షితంగా రండి" అంటూ కమాండరు ఇద్దరు సాయుధ పోలీసులను ఆనందరావు అధీనం చేశాడు. వాళ్ళు తమ తమ ఆయుధాలతో అంబులెన్సు కారులో ఎక్కారు. వాళ్ళదగ్గర 'మెషీన్ గన్సు' వున్నై. అవి అత్యుత్తమమైనవి. అవి ఒకటిన్నర ఫర్లాంగు దూరంలోని జనాన్ని కూడా దారుణంగా బలికొంటాయి.

ఆనందరావు రెట్టించిన ఉత్సాహంతో కారులో డ్రైవరు ప్రక్కన కూర్చున్నాడు. పోలీసులు అంబులెన్సులోపల బయటికి కనపడకుండా కిటికీల తెరలవెనకవున్న తెరలు దించుకొని కూర్చున్నారు. దారిలో సాయుధ పోలీసులను అగ్నిమాపక దళంలోని పోలీసులకూ స్నేహపూర్వకమైన సంభాషణ జరిగింది.

అవసరమైనప్పుడు విజిల్ వూదమనీ, తమ కర్తవ్యనిర్వహణకు సిద్ధంగా వుంటామని ఆ సాయుధపోలీసులు ఆనందరావుకు చెప్పారు. ఆనందరావు అందుకు సమ్మతించాడు.

అనుకొన్నట్లుగా అంబులెన్సు కారు సూర్యారావుపేటకు ఏ ఆటంకాలు లేకుండా చేరింది. ఎ. డి. యం. వో. గారి ఆర్డరు ప్రకారం అక్కడ ఆస్పత్రిలోవున్న యిద్దరు రోగులనూ "స్ట్రెచర్" లో అంబులెన్సు కారులో ఎక్కించుకొని తిరుగు ప్రయాణానికి కారును విజయవాడ మార్గం పట్టించారు. ఆ రోగులు ఇద్దరూ కూడా రజాకార్ల దండగానికి గురైనవారే. వారి వంటిమీద అక్కడక్కడ కత్తిపోట్లు వున్నాయి. వస్త్రాలు రక్తంతో తడిసివున్నై. ఇద్దరికీ వంటిమీద స్పృహ లేదు.

అంబులెన్సు కారు తిరుగు ప్రయాణం మొదలుపెట్టేసరికి సుమారు రెండుగంటలో మూడుగంటలో అవుతుంది. తమ కర్తవ్యం నిర్వహించుకొని తిరిగిపోతున్నామనీ ఆనందరావు ఉత్సాహంగా వున్నాడు. డ్రైవరు కూడా మంచి హుషారులో వున్నాడు. కారును మంచివేగంతో నడుపుతున్నాడు.

సూర్యారావుపేట వదలిపెట్టి ఒక అరగంట అయింది, రోడ్డుకు అటూఇటూ చెట్లు

గుబురుగా పెరిగివున్నై. అసలు అది అంతా అడవి. అక్కడక్కడ చిన్న చిన్న కొండలు వున్నాయి. అడవులలోనుంచి అప్పుడప్పుడు పులుల అరుపులుగూడా ఒకటిరెండు వినపడుతున్నై. ఆకాశంలో నక్షత్రం కాంతీ, కారులైటూ తప్ప చుట్టుప్రక్కల అంతా గాఢాంధకారం.

ఒకటిరెండు ఫర్లాంగుల దూరంలో ఓకొండ వున్నది. ఆ కొండవద్దనే కొంత మంది గుంపుగా నిల్చొని వున్నారు. కొందరికి పొడుగాటి గడ్డాలు వున్నాయి. వాళ్లు తమలోతాము ఏమో గుసగుసలాడు కొంటున్నారు. దూరంగానుంచే వాళ్ళు ఆనందరావుకు కనబడ్డారు. వాళ్ళు కారువేపే చూస్తున్నారు. ఆనందరావుకు మనస్సులో అనుమానం, భయమూ కలిగింది. కాని బయటపడలేదు. కారు ఓ ఫర్లాంగు దూరం పోయింది. ఇంతలో ఓ అరడజను మంది, ఆ గుంపులోనుంచి వచ్చి దారికి అడ్డంగా రోడ్డుమీద పడుకొన్నారు. డ్రైవరుకుగానీ, ఆనందరావుకుగాని వారివుద్దేశ్యం తెలియలేదు. డ్రైవరు విధిలేక కారును ఆపాడు.

కారు ఆగిందో లేదో ఆ పడుకున్నవారూ, రోడ్డుప్రక్కన కొండదగ్గర నిల్చొన్నవారు కారును ముట్టేశారు.

“ఆనందరావునూ, డ్రైవరునూ చూసి” “దిగు, దిగు” అని కేకలు వేశారు ఉర్దూలో. ఆనందరావు దిగాడు. డ్రైవరుకూడా దిగాడు. ఆ గుంపంతా తమతమ దుస్తులలో దాచుకొన్న ఆయుధాలు పైకితీశారు. అందరిదగ్గరా కత్తులూ, రెండుబార్ల తుపాకులూ భయంకరంగా కనుపించినై ఆనందరావుకు. అతనివళ్లు కంపించి పోయింది. అందరూ ఆనందరావును చుట్టుముట్టారు. ఒకడు రెండుబార్ల తుపాకీని ఆనందరావు గుండెలకు ఎదురుగా పెట్టాడు. ఇంకొకడు తళతళలాడే పొడుగాటి కత్తిని వీపుకు ఆనించాడు. ఇంకొకడు ఓ లావాటికర్రని నెత్తిమీద ఆనించాడు. అందులో ఒకడు “హాండ్సప్!” అనగానే ఆనందరావు చేతులు ఎత్తక తప్పిందికాదు. డ్రైవరు అవస్థకూడా అలానేవుంది.

“మారో! మారో” అంటూ గుంపులోనుంచి కేకలు.

“తుమ్ కౌన్‌హో!” అందులో ఒకడు ఆనందరావును చూసి గర్జించాడు.

“మై పోలీసువాలా నహీ హూఁ. మై ఫైర్ సర్వీసువాలా హూఁ. అన్నాడు వచ్చీరాని తురకంలో ఆనందరావు.

“తుమ్ కహాఁ సే కహాఁ జారహే హైఁ” అన్నాడు ఇంకొకడు.

తాను విజయవాడ ఎ. డి. యమ్. వో గారి ఆర్డరు ప్రకారం సూర్యారావుపేటనుంచి ఇద్దరు రోగులను విజయవాడకి తీసుకువెళుతున్నామనీ, తమకు యే యితరవిషయం తెలియదనీ, తాము రజాకార్లకు యే అపకారమూ తలపెట్టటానికి వచ్చినవాళ్ళము కామనీ, తమని వదిలిపెడితే, కారునడుపుకొని తమదారిన తాము పోతామనీ ఆనందరావు ఆ గుంపు లీడరుకు విన్నవించుకొన్నాడు.

కాని గుంపులోనివాళ్లు వినకుండా ఆనందరావును కాల్చిచంపెయ్యాలని గోలపెట్టారు.

ఆనందరావు వాళ్ళ గోల చూసి తన ప్రాణాలమీద ఆశ వదులుకొన్నాడు. సాయుధపోలీసులు ఇద్దరూ రోగులతోపాటు అంబులెన్సులోపల కూర్చొని జరుగుతున్న గందరగోళమంతా వింటున్నారు. తమ మెషిన్‌గన్నులతో, ఏ క్షణానైనా కాల్చటానికి సిద్ధంగా వున్నారు. వాళ్ళు ఆనందరావు విజిలుకోసం నిరీక్షిస్తున్నారు. ఆనందరావు పాపం యేం చేస్తాడు? ఆగుంపు చూద్దామా అంటే పన్నెండుమంది వున్నారు. తాను ఒక్కడు. పైగా తన చేతులు తన స్వాధీనంలో లేవు. చేతులు పైకి ఎత్తుకుని నిల్చున్నాడు. ఈల జేబులోవుంది. చెయ్యి కదిలిస్తే తను వాళ్ల రెండు బార్ల తుపాకికి క్షణంలో ఆహుతైపోతాడు. వాళ్లు అంతా మతపిచ్చితో,మంచి ఆవేశంలో వున్నారు. అతని మెదడు వేడెక్కి పోతున్నది. వాళ్లకు అనేకవిధాల చెప్పి చూశాడు.

“అరే భాయీ. నేను పొట్టకోసం మీలాగే ఉద్యోగంలోకి వచ్చాను. పొట్టకోసం వాళ్లు చెప్పినపని చేస్తున్నాను. అదైనా నేను యేంఘోరం చెయ్యటంలేదు. అపాయంలో వున్న ఇద్దరు రోగుల ప్రాణాలు కాపాడటానికి ఆస్పత్రికి తీసుకుపోతున్నాను. కావాలంటే చూడండి! అదిగో రెడ్‌క్రాస్! మీకు పగ నామీదనా? భారతప్రభుత్వం మీదనా? నాబోటి నిరాయుధుణ్ణి చంపితే మీకు ఏమివస్తుంది? మీకు పౌరుషంవుంటే ప్రభుత్వసైనికులను ఎదుర్కొండి. గెలవండి. అంతేగాని మాబోటి ఇలాంటి నిరాయుధులను చంపి మీ పరాక్రమానికి ఎందుకు అపకీర్తి తెచ్చుకొంటారు? నామాటవిని మమ్మల్ని, వదిలెయ్యండి. మళ్ళీ ఇంకెప్పుడూ ఈ వేపు తిరిగిచూడం,” అంటూ ఆనందరావు అనేకవిధాల ఆ రజాకారులతో వాదించాడు.

అప్పటికీ ఆ రజాకార్ల నాయకుడు మెత్తబడలేదు. ఆనందరావు ప్రాణాలమీద ఆశ వదులుకొన్నాడు. అంత చిన్నవయస్సులోనే ఈ దౌర్భాగ్య మరణానికి గురికాబోతున్నందుకు తన్ను తాను తిట్టుకొన్నాడు. విధి బలీయమనుకొన్నాడు. తను ఈ పాడు వుద్యోగంలో ఎందుకు చేరానా అని అనుకొన్నాడు. తన ఖర్మం కాలి ఈ రజాకార్ల గొడవ ఇప్పుడే రావాలి. ఈ గొడవలకే ప్రభుత్వం వారు రెండు ఫైర్ సర్వీసు యూనిట్లను, రెండు అంబులెన్సు కార్లను విజయవాడ ఆస్పత్రి మెడికలు ఆఫీసరుగారి అధికారంలో వుంచారు. యూనిట్లలో వున్నవాళ్ళంతా ఆయన ఉత్తర్వులు పాటించాలి. ఆయన దగ్గర ఓ వైర్‌లెస్ సెట్ కూడా వుంది. ఆ రోజున తను ఎనిమిది గంటలకు డ్యూటీకి వచ్చాడు. సూర్యారావుపేటనుంచి మెడికలు ఆఫీసరుకు వైర్‌లెస్ ద్వారా వార్త వచ్చింది కాబోలు. పదిగంటలకు తన్నూ డ్రైవరునూ పిలిచి అక్కడ ఆస్పత్రిలో ఇద్దరు రోగులు దెబ్బలు తగిలి ప్రమాద పరిస్థితిలో వున్నారని వారిని వెంటనే తమ ఆస్పత్రికి చేర్చమని ఆనందరావుకు ఎ. డి. యం. వో గారు ఉత్తర్వు ఇచ్చారు.

విజయవాడ నుంచి సుమారు నూటనలభై నూటయాభై మైళ్ళు వుంటుంది. ఆనందరావు సుమారు పదకొండుగంటలవుతుండగా అంబులెన్సులో బయలుదేరాడు. మొదట అతనికి అనుమానంగానే వుండి ఎక్కడ తను రజాకార్ల చేతిలో చిక్కుకోవల్సివస్తుందోనని. కాని తప్పని సరిగా బయలేరాడు. ఇప్పుడు తన ప్రాణాలు ఏ క్షణానైనా పంచభూతాలలో కలిసి పోవచ్చు ఇప్పుడేం చెయ్యాలి? ఏం చెయ్యటానికి అతనికి తోచలేదు. తనకు చేతనైనంతవరకు వాళ్ళని బతిమాలాడు. లాభం లేక పోయింది. ఆఖరిసారిగా నిరాశచేసుకొని ధైర్యంగా రజాకార్ల నాయకుడితో ఇలా అన్నాడు.

“సరే నేను సిద్ధంగావున్నాను. ఇదిగో కాల్చండి. ఈ అత్యాచారానికి మరెప్పుడైనా మీ అల్లాముందు సమాధానం చెప్పుకోవాల్సివుంటుందని మర్చిపోవద్దు” అంటూ ఆనందరావు రొమ్మువిరుచుకొని తుపాకీ బారుకు ఎదురుగా నిల్చొన్నాడు.

ఆనందరావు ఆఖరిమాటలు రజాకార్ల నాయకుడిలో కొంత సంచలనం కలిగించినై. అవును. నిరాయుధులైన ఇద్దరు కాఫరులను చంపితే అల్లా మెచ్చుకొంటాడా? అతనికి అనుమానం కలిగింది. పైగా కారులోని రోగులుకూడా చచ్చిపోతే మొత్తం నలుగురి చావుకు తను సమాధానం చెప్పాలి. అతని మనస్సు మెత్తబడింది. ఆనందరావును వదలవలసిందిగా అతను తన అనుచరులకు ఆజ్ఞాపించాడు.

“మిమ్మలిద్దరినీ అల్లానుతలచి వదలిపెడుతున్నాం. తిరిగి ఎప్పుడూ ఈచాయలకి రావాకండి. “జావ్!” అన్నాడు ఆనంద

(49-వ పేజీ చూడండి)



# పోటిలేని శ్రేష్ఠతకు అద్భుతమైన పనితనమునకు

## రెండు దివ్యమైన నేషనల్-ఎక్కో మోడలులు!



ఇవిగో, మీరు రేడియో ప్రసారములను దివ్యముగా విని ఆనందించుటకు చక్కగా పనిచేసే, అత్యంత శ్రేష్ఠమైన రెండు నేషనల్-ఎక్కో మోడలులు! అవి 'మాన్సూనైజ్' చేయబడినవి మరియు వాటితో ఒక సంవత్సరము గ్యారంటీ యివ్వబడుతుంది. మీ దగ్గరలోనున్న నేషనల్-ఎక్కో వ్యాపారివి వాటిని పెట్టమని నేడే వినండి!



మోడలు 717: బంగారు రంగు జావళముంతో, మరూన్ రంగు ప్లాస్టిక్ క్యాబినెట్. మోడలు యు.717: 6 వాల్వులు, 8 బ్యాండులు: 230 వోల్టుల కరెంటు మీద పనిచేసే ఎసి/డిసి సెట్. మోడలు బి-717: 6 వాల్వులు, 8 బ్యాండులు: డ్రై బ్యాటరీ సెట్.
రు. 250/-

అన్ని ధరలూ నెట్:
స్థానిక పన్నులు అదనము



మోడలు 187: 6 వాల్వులు, 8 బ్యాండులు. అందమైన కర్ర క్యాబినెట్. మోడలు ఎ-187 ఎసి సెట్; మోడలు యు-187 ఏసీ/డిసి సెట్ రు. 475/-

నేషనల్-ఎక్కో రేడియోలు
శ్రేష్ఠమైనవి - అని




చేయబడినవి




జెనరల్ రేడియో & అప్లయన్సెస్ ప్రైవేట్ లిమిటెడ్
ఒపేరా హౌస్, బొంబాయి 4 • 3 మదన్ స్ట్రీట్, కలకత్తా 13 • 1/18 మౌంట్ రోడ్, మద్రాసు
36/79 సిల్వర్ జూబిలీ పార్క్ రోడ్, బెంగుళూరు • కోర్నేషన్ బిల్డింగ్స్, చాందినీ చౌక్, ఢిల్లీ

GRA (370)




## 27

పుల్లయ్య ప్రయాణం స్థిరమయ్యింది. ఊళ్ళో కొందరు, పులివేషంలో చుట్టుపట్ల గ్రామాల్లో పేరుపడ్డ పుల్లయ్యని ఒకసారి వేషంవేసి మరీ వెళ్ళిపోవాలన్నారు. కాదనలేకపోయాడు. ఒంటికి రంగు పులిమి పులిబుర్ర తగిలించినా మల్లు పులికి జడవలేదు. 'నానూ పులి' అని యేడవడం మొదలుపెటగానే మల్లుక్కూడా రంగు రాసారు. ఒక పచ్చగుడ్డమీద పులిబుర్ర గీసి కళ్ళు, నోరు, ముక్కుకు దగ్గర ఆ గుడ్డ కత్తిరించి తలకి కట్టారు. తోక తగిలించారు. పులిపిల్లలా వున్నాడు. కొడుకే ముందు యిల్లుయెక్కి వెన్నుమీద నిల్చుని ఆడుతుంటే చూసేవాళ్ళందరూ ముచ్చటపడి యింకా ఆడమని కేకలు వేసారు. తండ్రికన్న కొడుకు ఆటే బాగుందని అంతా మెచ్చుకున్నారు. ఆ రోజుల్లో పుల్లయ్య ఆట చూసినవారు యీనాడు "యీడు పుల్లయ్యేనా?" అని ఆశ్చర్యం చెందారు. "మనిషి బాగా పీతలా అయిపోనాడు. ఆ చాలాకీ! అప్పుడు డప్పులు ఆగేవే కావు. ఇప్పుడు ఏం వున్నయ్ - యెముకలు తప్పించి..." అని తలోలా వ్యాఖ్యానించుకున్నారు.

ఆట ఆడి యేటిలో స్నానంచేసి రంగులంతా పూడ్చుకొనేసరికి రాత్రయింది. ఇంటికి ఆకలితో వచ్చేసరికి గంజే వుంది. కొడుకో బుక్కెడు తనో బుక్కెడు మిరపకాయ నంజుకొని తాగాక యెదరగా నిల్చున్న పెళ్ళంతో అన్నాడు:

"అంత పెద్దపట్నం - అందరూ ఒక బస్తా మోస్తే నాను రెండు బస్తాలు ఒక్కసారే మోస్తాను...ఈ కడుపుమంట పరిలే..."

"తినని దిరుసెందుకు సెప్పుకోవాల!"

"రాయే! ఇంకా పెద్దరోజు లుంటాయా? కష్టపడాను. నాయం నీతికీ కట్టుబడతాను. నా పిల్లలకి లోటేం వుంటాది?"

తలెత్తి పెళ్ళం వేపు చూసాడు. మరి గంజి తాగలేదు. కొడుకు తాగగా మిగిలింది నీలి గొంతుకలో వేసుకుంది.

ఊరు కదిలేవరకు ఆలోచనలోనే వున్నాడు. అందరితో చెప్పడం అయిపోయింది. నీలి గుడ్డి వెంకన్నకు, గన్నెమ్మకు, కుష్ఠురోగికి రేపు వెళిపోతామనగా ఈరాత్రి భోజనం పెట్టింది. అన్నీ సర్దుకొనేటప్పుడు వెంకన్న మల్లుకి యిచ్చిన మంటిబెడ్డ అగపడింది. ఆ బెడ్డను పట్టుకొని కొంతసేపు మౌనంగా అలా నిల్చుండిపోయింది. ఆ బెడ్డ విసరడానికి చేతులురాలేదు. మళ్ళా యేనాటికైనా కొడుకు మంటిని నమ్ముకోడా అన్న ఆశతో ఆ బెడ్డను సామాన్లలో దాచింది.

తెల్లవారింది. కొద్దిగా చలివేస్తోంది. తూరుపున మబ్బుల్లో దినకరుడు దాగున్నాడు. ఏరు రెండు ఒడ్డులూ తీసి పారుతోంది. సామాన్లున్న బస్తా పుల్లయ్య భుజం మీద వేశాడు. నీలి కూతుర్ని యెత్తుకుంది. వెంటపీస, ఆదెమ్మప్ప వెంకన్న వగైరా అంతా వున్నారు. ఇంటివేపు ఒకసారి చూసి ముందుకు నడిచింది. మళ్ళీ వెనకకు తిరిగి చూడలేదు. వెళ్ళిపోతుంటే త్రోవలో ఆడమ్మలు నిల్చొని పలుకరిస్తున్నారు. నీలి తలెత్తకండా జబాబు మెల్లగా యిస్తోంది. ఆదెమ్మప్ప పుల్లయ్యతో బుద్ధులు చెప్తోంది. "నాయనా! బుద్ధిగావుంటే బువ్వతింటావు. దుడుకుతనం, పౌరుసం పెట్టుకోక. అదిసెప్పినటు విన్నావంటే బాగుపడతావు. నాలుగు రాళ్లు గడించుకొని మళ్ళా యీవూరు వస్తే నిన్ను కాదన్నోడు యెవుడు?"

పీస అన్నాడు "పుల్లిగా! అంతపట్నం-యెక్కడేనా బతికిపోతావు. నా గవుర్నమెంటోడు పెద్దోడు అవుతున్న కొద్దీ బాగా పోషించడా? లచ్చి లచ్చనాలని తెస్తుంది. పట్నం యెళ్ళమారిపోనా?"

నీలమ్మ గుడిదగ్గరకు వచ్చారు. ఆగి, దంపతులు మొక్కారు. మల్లుకూడ తండ్రిని చూచి చేతులు జోడించాడు. రోడు యెక్కారు. పుల్లయ్య ఆగిచుట్టూ చూసాడు.

# ★ దగా పడిన తమ్ముడు ★

చరిచేలు కోతలకు సిద్ధంగా వున్నాయ్. అంతా పసుపు పచ్చ ఆకుపచ్చల కలయికలో వేల కొద్ది యకరాలు. ఒక పెద్ద మైదానంలావుంది. ఇటువేపు ఊరు - అక్కడక్కడ పొగ గ్రమ్ముతోంది. పలుపెక్కిన నీలమ్మ గుడి తూరుపువేపు అలా యెత్తుగా వున్న పరుగుడు చెట్లు-పడమట వేపు వారధి-యేరు! ఇదంతా చూస్తుంటే తనకు యింతవరకూ వున్న ధైర్యం సడలిపోసాగింది. అంపకానికి వచ్చిన వాళ్ళు తిరిగి పోతూ కళ్లల్లో నీరు తెచ్చుకున్నారు. పైకి యేడవకుండా ఉబ్బురోగి వెంకన్న కళ్లలోనుంచి యేకధారగా నీరు కారుతోంది. నోటిలో గుడ్డలు కుక్కుకున్నారు.

పుల్లయ్యకు ముందుకు కాలుపడలేదు. రైల్వే స్టేషను యేడుమైళ్లు దూరంలో వుంది. నడవాలి. కాళ్లు పీకేస్తున్నాయ్. వెనుకనుంచి వూరనే అభిమాన బంధాలు వేస్తోంది. ఎలాగున్నా నా వూరు బంగారమే! ఈ బంగారాన్ని వదిలి యెలిపోతున్నాను-మళ్లా రాకుండా...నూడకుండా ఆకలితో పచ్చిపోతే యిక్కడే బుగ్గయిపోతాను...పట్నం పోను...నా వూరూ! నా తల్లి! ఉండిపోతానమ్మా...ఇలా అనుకుంటూనే ఒక్కో అడుగూ వేస్తున్నాడు. కళ్ళలో నీరు ఉబికిపోతోంది. గుండె బరువెక్కుతోంది-కాళ్లు పీకేస్తున్నాయ్.. వారధి మీద కాలు పెట్టి వెను తిరిగి తిరిగి చూశాడు...మౌనంగా తలదించుకొని నీలి వెంట వస్తోంది. ఆమెను చూసాక యెందుకో మొదట సిగ్గు వేసింది—తరవాత జాలివేసింది - అభిమానం కట్ల తెంచుకొని పురకలు వేసింది.

ఏదో అందామనుకున్నాడు - మాటరాలేదు. నీలి కూడా మౌనంగా శాంతంగా ఒకసారి తలెత్తివడిగా నడవటంతో పుల్లయ్యలో కొత్త బలం కలిగింది. మల్లువారధి మీద పెద్ద అంగలు వేసుకొని సిపాయిలా ముందు నడుస్తున్నాడు. అటునుంచి గొఱ్ఱెల మంద వస్తోంది. గొఱ్ఱెల కాపరి "యెటయ్యా..." అంటే మల్లే గట్టిగా పంతొ మంతో 'పట్నం పోతాం!" అన్నాడు.

పూరివేపు గొఱ్ఱెలు తలలూపుకుంటూ సాగిపోయాయి! బరువుతో ఆశతో వాళ్ళ కాళ్లు ముందుకుపడుతున్నాయ్ !

## 28

స్టేషను చేరుకొనేటప్పటికి పొద్దు నెత్తిమీద వుంది. చెమటలు కక్కుకుంటూ యీ కుటుంబం స్టేషనులో ఒక మూల కూలబడిపోయింది. కొంతసేపయ్యాక పుల్లయ్య లేచాడు. మల్లు వెంటపడ్డాడు. రూపాయి మార్చితే యింకేమీ మిగలేదు. అరటిపళ్ళు, జంతికలు వగైరా తిని మంచి నీళ్ళు త్రాగారు. ఈలోగా గూడ్సుబండి వచ్చింది. మల్లు వుత్సాహం యింతా అంతా కాదు. అయ్యను ప్రశ్నలతో చిరాకెత్తిస్తున్నాడు. ముఖం వెలిగివుంది. మధ్యాహ్నం మూడు గంటల పదినిముషాలకి రైలు వచ్చింది. జనం కిటకిటలాడిపోతున్నారు. ఎక్కడా ఖాళీ లేదు. ఈ చివరనుంచి ఆ చివరకు పరుగు లెత్తారు. ఒక దగర త్రోసివేశారు. ఇంకో దగ్గర ఖాళీగావుంది కానీ లోనున్న దుబ్బు మనిషి "ఇదిపరుపులపెట్టె...ఎక్కితేకైదు" అన్నాడు. ఎలాగో రైలు కదులుతుండగా చివర పెట్టెలో సర్దుకున్నారు. టిక్కెట్టు లేని యిద్దరు ప్రయాణీకులు రైలు కదులుతుండగా ఆ పెట్టె యెక్కారు. పెట్టెనిండా జనం. క్రిందను కూర్చోడానికి కూడా జాగాలేదు మూటమీద మల్లుకూర్చున్నాడు. పుల్లయ్య నీలి చేతిలో పిల్లతో నిల్చున్నారు. రైలు కదిలిపోతోంది.

మల్లు సంతోషానికి హద్దులేకుండా వుంది. మూటను మద్దెలచేసి చేతులతో కులాసాగా వాదుతున్నాడు. నాలుగు స్టేషన్లు దాటి రైలు అయిదో స్టేషను చేరగానే పెట్టెలో రద్దీ తగ్గింది. రైలు వూలవేస్తే మల్లుకూడా నాలిక ముడిచి రెండు వేళ్ళు నోటిలో పెట్టి వూలవేశాడు. రైలు మెల్లగా కదులుతోంది... అయ్యా అమ్మా మెల్లగా చోటు చేసుకొని రెండు వేపులా దిగులుగా కూర్చున్నారు. పుల్లయ్యకు గతమంతా జ్ఞప్తికి వస్తోంది. తన యిలువాకిలీ, పొలం తను...... పెళ్ళాం, పిల్లలు......వెంకన్న...... రాజిగాడు......అదెమ్మప్ప......వగైరా అంతా మనసులో తిరిగిపోతున్నారు. చచ్చిపోయిన ముసలమ్మ దాసుడు నీలమ్మ గుడి నీలమ్మతల్లి అంతా మనసులో కదిలిపోతున్నారు. ఎప్పుడో మళ్ళీ తన వూర్లోనే బుగ్గయిపోవాలనుకున్నాడు. కిటికీ గుండా పరుగులెత్తుతున్న ప్రకృతిని చూసి మల్లు వుత్సాహంతో. "అయ్యా" అని కేక వేసి "నూడునూడు...చెట్లూ కొండలూ మనూరు కేసి పరుగున పారిపోతున్నాయ్!"

ఇప్పుడు పుల్లయ్యకు తను రైలుమీద పట్నం పోతున్నానని జ్ఞప్తికి వచ్చింది. మాటాడకుండా పట్నం విషయం తలచుకున్నాడు. బాగా కష్టపడి సుఖంగా బ్రతుకుతానని వూహించుకున్నాడు.

వాల్తేరు చేరేసరికి రాత్రి యెనిమిదిన్నర గంటలైంది. పెట్టెపెట్టెకు తనిఖీకి చేతి కర్ర పట్టుకొని చెకింగ్ యిన్స్పెక్టర్లు వస్తున్నారు. గేటుదగ్గర టికెట్ కలెక్టరు వీళ్లని ఆపి బస్తాలో బియ్యం లేవా అన్నాడు. పుల్లయ్య మాటాడలేదు కానీ నీలి "కుంచం బియ్యం పెయ్యికాపు కేసుకున్నాం బాబూ!" అంది. "పోలీసు లొస్తారు ఉండండి" అన్నాడు. నీలికి భయంవేసింది. వాళ్ళ పెట్టెలోనే వచ్చిన కోటేసుకున్న బాబు ట్రంకుపెట్టి నిండా బియ్యం యేసుకున్నాడు. ఆయనను యెవరూ అడగలేదు, చకచక నడుచుకుంటూ వెళ్ళిపోయాడు. పట్నం అంటే తొలిసారి తెలిసివచ్చింది. నాలుగు రూపాయిలు పుచ్చుకొని విడిచిపెట్టిన టికెట్ కలెక్టరుకు పుల్లయ్య యేదో అనబోతుంటే నీలి వారించి "కైదు తప్పించాడా బాబు-ఆ మాత్రం పుచ్చుకోడా?" అంది.

మల్లు జిగేల్ జిగేల్‌మన్న దీపాలవేపు, పరుగులెత్తుతున్న కారులు, రిక్షాలు, బస్సుల వేపు వింతవింతగా చూస్తున్నాడు. మేడలూ మిద్దెలూ కనిపిస్తుంటే యెక్కడికక్కడే ఆగిపోతున్నాడు. ఒకదగ్గర లౌడ్‌స్పీకరు నుంచి సినిమాపాట బొయ్‌మనివస్తుంటే మల్లు చెయ్యి పటుకలాగితేగానీ కదిలాడు కాదు, వస్తూనే "అయ్యా! అంత గట్టిగా...... పదం!...అదు పెద్దమనిషా?"

పుల్లయ్య "పూసగ్రాపు పాడతందిరే మనిషి కాడు."

"అయ్యొ పూ స గా పు...అదెలాగుం టుంది ?"

"పాటె."

"పాటె పాడలేదా ? వాకోటి కొని పెట్టవూ ?"

"పైసాలు దొరికితే అవే కరువా !"

ముందుకు నడిచారు. అ స్త్రోఅ గంట వాయించుకుంటూ మిఠాయి దుకాణంబండీ వెళిపోతోంది. అయ్యాఅయ్యా అంటూ ఆగిపోయాడు. చేతిలో పొట్లాం పడాకనములు కుంటూ వెళ్తుంటే అక్కడక్కడ పిల్లలు కనిపించారు. వాళ్ళంతా లాగులూ కమీజులూ వేసుకున్నారు. ఆడపిల్లలు గౌనులు వేసుకున్నారు. తనకు లాగుంటే అనుకున్నాడు. "అయ్యా నాకు అలాంటిది, సెల్లికి యిలాంటిది" అని యిద్దరు వెళ్ళిపోతున్న పిల్లలను చూపించాడు.

"అన్నీ యిాయేళే. రేపు కొందాంలే !" అన్నాడు.

టర్నర్ సత్రంలో కాలు పెట్టగానే కుక్కపిల్ల కనిపించింది. చుచ్చా అని పిల్చాడు. పకోడీముక్క చూపించాడు. రుచి మరిగింది. వెంటపడింది. ఒక్కముక్క తనకు యింకో ముక్క కుక్కకు...ఈ కుక్కపిల్ల హడావుడిలో పడి అయ్యను యింకేం ప్రశ్నలూ వెయ్యలేదు.

సత్రంలో గదులు శ్రీమంతులకు మధ్యతరగతి వాళ్లకు వేరువేరుగా వున్నాయ్. డబ్బుయిచ్చుకోలేని ప్రజలకు పెద్ద పందిరలా వున్న తాటాకుల యిల్లు ఒకమూల వుంది. అందులో ఒకమూల మూటదించాడు పుల్లయ్య. సింహాచలం పుణ్యస్థలం దర్శించి దగ్గరగా వున్న యీ పట్నాన్ని చూడటానికి వచ్చిన పల్లె జనం అందులో కిటకిటలాడుతున్నారు. ఒకమూల వంటలు సాగుతున్నయ్. చిన్న పిల్లలు నలుగురు గగోలుపెట్టి యేడుస్తున్నారు. తలలు గుండు చెయ్యించుకున్న ఆడంగులు యిద్దరెవరో నలుగురు మొగవాళ్లతో మాటల యుద్ధానికి దిగారు. ఒక వయసు మళ్లినవాడు చేతిలో కర్రతో కుక్కల్ని తరుముతున్నాడు. యెక్కడక్కడే వుమ్ములు, యెంగిళ్ళతో పరిసరాలు అసహ్యంగా వున్నాయి.

పుల్లయ్య కర్రపుల్లలు నూనె వగైరా కొనితెచ్చాడు. నీలి వంటప్రయత్నంచేసింది. మల్లు ఒకవేపు కుక్కపిల్లని పెట్టుకొని యింకోవేపు నేలమీద దొర్లుతున్న చెల్లెమ్మను ముద్దులాడుతున్నాడు.

వీళ్ళ భోజనాలయ్యేసరికి యింకా యీ పందిరలో గలాటా తగ్గలేదు. ఎవరో యిద్దరు ఆడంగులు కయ్యామాడుకొని పాతవన్నీ యెత్తిపొడుచుకుంటున్నారు. ఇద్దరికీ మొగు



ఆనాటి నావోడు సెందురూడా!
అలిగిరావేదోయి సెందురూడా!

(యెంకి పాట)

చిత్రకారుడు: పీరిశెట్టి అచ్యుతరావు -పుల్లేటిమర్రు.

డైన పురుషుడు పెద్దగొంతుకతో అరుస్తున్న రెండో పెళ్లాన్ని నలుగురిలో పరువు నిలుపమని బతిమాలుకుంటున్నాడు. అది అలా వుండగా యింకో ముసలాడు యింకా అన్నం వెయ్యమని కోడలిని అడుగుతుంటే, ఆమె మూతిపోట్లు పొడిచిందని చచ్చిన కూతుర్ని తలంచుకొని యేడుస్తున్నాడు. ఒక ప్రక్క ఇంకా పొయ్యిలు వెలుగుతునే వున్నయ్. ఒకమ్మ చేపలుకోసి నోరు వూరించుకొని పులుసుపెట్తోంది. ఇంకో మూల ఆసుపత్రికని వచ్చిన రోగిష్టి కడుపు నొప్పితో యేడుస్తూ అప్పుడే చచ్చిపోతున్నట్లున్నాడు. ఒక పిల్లాడు తనకు వచ్చిన పదాలు పాడుకుంటున్నాడు. ఒక యౌవనుడు యిదివరకు ముక్కుముఖం యెరగని బింకమైన స్త్రీతో సరసాలకు దిగబోతున్నాడు. వీళ్ళు మాటాడితే చెయ్యిచేసుకుందామని ఆ స్త్రీతో యిదివరకు మాటాడిన వ్యగ్రామస్తుడు కోపంతోనూ, మాత్సర్యంతోనూ ఒకమూల కూర్చొని చూస్తున్నాడు. ఆ మాయకునిలా ఒక దొంగ యెదరగా వున్న కోళాయిదగర కూర్చొని అలా వచ్చే ఆడంగుల మెడలవేపు కనిపెటి చూస్తున్నాడు. ఒక కుక్క ఇంకో కుక్కమీదకు ఘీంకరించి వురుకుతోంది! ఈ చిన్న లోకంలో వున్న నీలి పుల్లయ్యలకు అలసివుండటంవల్ల నిద్దర ముంచుకొచ్చింది. మధ్యను మల్లును, పిల్లను వేసి

చెరో వేపు పడుకున్నారు. మూట పుల్లయ్య తలవేపు వేసుకున్నాడు. అన్నం తిన్న పక్కపిల్ల మల్లు కాళ్ళదగ్గరకు వచ్చి పడుకుంది. మంచి రాత్రిమీద చలి వేసింది. పుల్లయ్య కప్పుకోవాలని బస్తాలోని పంచె తీయడానికి లేచాడు. ముడుకులు కడుపులో పెట్టుకొని పెళ్ళాం పిల్లలు పడుకున్నారు.

అంతా నిద్దర పోతున్నట్టే వున్నారు. గోడమీదనున్న మెర్క్యురీ బల్బు వెలుతురు పందిరలో ఒక మూల పడుతోంది. ఆ వెలుతురులో మిగతా భాగం చూచాయగా కనిపిస్తోంది. "నాయనా" అని ఎవరో తనకుదగ్గరగానే పిలిచినట్లు వినిపించింది. ఆ గొంతుక మళ్లీ వినిపించింది. ఒక ముసలివాడు. వాడిని ఆ కీనీడలో చూస్తుంటే దాసయ్యను చూసినట్లయింది. దాసయ్యే యీ రూపంతో తన కేదో త్రోవ చూపించాలని వచ్చాడేమో అనే నమ్మిక వెంటనే కలగసాగింది. శరీరం ఒక్కసారిగా యీ తలుపుతో పులకరించి గగుర్పాటు చెందసాగింది. వినయంతో, భక్తితో దగ్గరగా వెళ్లాడు. ప్రక్కనే కూర్చున్నాడు. మెల్లగా చెవులో యేదో గొణిగాడు. "నువ్వు పడుకో తాతా! నాను కాస్తానులే" అని హామీ యిచ్చి పుల్లయ్య తిరిగివచ్చాడు. పంచె తీసి కొడుకు కూతురు మీద కప్పాడు. మళ్లీ చారబడి నిద్దర అభినయిస్తూ ఒళ్ళంతా కళ్లు చేసుకొని పందెర అంతా చూస్తున్నాడు.

నిశిరాత్రి! నిశ్శబ్దంగా వుంది. ముసలాడు టోకుర్లు తీసుకొని నిద్దరపోతున్నాడు. అందరిలో తెలివితో ఉన్నవాడొక్క పుల్లయ్యే! నిద్దర పారిపోయింది. యెదురుగా కొళాయి వెనుక దాగున్న యిద్దరూ మెల్లగా పందిర వేపు రావటం చూసాడు. కొద్దిగా కూడా శబ్దం లేదు. చేతులు సర్దుకున్నాడు. ఉత్సాహం ఒళ్లంతా అలముకుంది.

అదిగో తలలువంచి మెల్లగా ఒకావిడ మెడ దగ్గరకు చేతులు వెళ్తున్నాయ్! పుల్లయ్య చప్పున లేచి వాళ్ళమీదకు సింహంలా వురికాడు! ముష్టియుద్ధం! పందెర అంతా మేల్కొంది. దొంగ దొంగ అని ఒకటే గగ్గోలు - పట్టుకోండి - చంపండి— కేకలు - పుల్లయ్యను, నుదుటిమీద చేతిలోని కత్తెరతో ఒక దొంగ వేసాడు. రెండో దొంగ పుల్లయ్య బనియను పట్టుకొని "ఇదిగో దొంగ అదిగో యీ అమ్మ మెడలోనిది కత్తిరించడానికివచ్చాడు...ఇదిగో కత్తిర!" అన్నాడు.

"మేం సమయానికి లేవకపోతే... చూసారా ముసాఫిర్ లా వచ్చి యెంతపని చేసాడో!" మొదటివాడు.

ఇలా వ్యాఖ్యానాలు దొర్లుకుపోతుంటే నుదిటిమీద గాయం బలంగా తగలటంచేత పుల్లయ్య కళ్ళు జిగేల్ మనటం వల్ల వెంటనే మాటాడలేకపోయాడు. దానికి తోడు నలుగురూ నాలుగు యిచ్చుకున్నారు. నీలి... "కాదు కాదు..." అని మొర పెట్టుకున్నా వినేవారెవరూ లేకపోయారు. పోలీసులకి అప్పచెప్పండని యెవరో అంటున్నారు. ఇంతలో టోకుర్లుతీస్తున్న ముసలాడు లేచి చూసుకుంటూ వచ్చాడు. దొంగలు పలాయనం చిత్తగిస్తుంటే పుల్లయ్య వున్నశక్తితో "వాళ్ళే దొంగలు పట్టుకోండి!" అని అరుస్తున్నలోగానే...మాయమైపోయారు. ముసలాడు నలుగుర్లోనికి వచ్చి పుల్లయ్య కళ్ళల్లో కళ్ళు పెట్టి చూసి "నాయనా! దొంగల్ని పట్టావురా!...అయ్యో పాపం! దెబ్బ తగిలిందా?...ఏరీ దొంగలు?" అన్నాడు.

పుల్లయ్య "ఒక్కడ్నీ యిద్దరి కాళ్ళూ యిరగ్గొట్దా మనుకున్నాను...బలే యేషం యేసి తప్పించుకొన్నారు!"...అన్నాడు అలసిపోతూనే.

కొంతసేపటికి నిజం అంతా తెలిసిపోయింది. మొగుడి తలకు గుడ్డచుట్టి కూర్చోబెట్టిన నీలి అందరిమధ్యనుంచీ తీసుకొని వెళ్ళి నేలమీద పడుకోపెట్టింది. నలుగురూ నాలుగు విధాల నొచ్చుకొంటున్న మాటలు చెవిని పడుతున్నాయ్. ముసలాడు "నిన్న జేసిన యేశాయిసేవం బాబూ! వాళ్లిద్దరె పోనారు...పక్కనున్నోడినైనా లేపినావు కాదు..."

మల్లుకు యేడుపు పోయి నవ్వు వచ్చింది. పక్కపిల్లతో సెప్పుకుంటున్నాడు "మాఅయ్య దొంగలు మీదపడి డబ్బుడు యేసేసినాడు... దొంగలుపారో..."

పుల్లయ్య యీ మాటలు విని నవ్వుకున్నాడు. నుదిటి మీద దెబ్బ రక్తంకట్టింది. కొంతసేపటికి నిదరపోయాడు. తెల్లవారగానే నీలి "యీ యేళ పొద్దుకుంగకముందే యేదో యిల్లూ వాకిలీ సూసుకుంటేగానీ... యిక్కడుండలేం" అన్నాది.

"ఇక్కడే వుందాం—ఈ రాత్రి మళ్ళీ వస్తారు—ఖర్చుకి బాగా యిచ్చుకుంటా" నన్నాడు పుల్లయ్య.

"ఈయాత్రకొచ్చినోలంతా యెల్లిపోతారు. దొంగలు పదుగురొస్తె అంతాసరి ... వాళ్ళ ముక్కలూ బద్దలుగొట్టి రక్తం కారించావు కదా వూరుకుంటారా? అయినా ఆయిదరూ మంచోలే — ఒడిలో కత్తితీసి పొడిసిసే యేంసేద్దుం? సాహసం చేయరానిచోట్లుంటాయి. అది తెలుకోలేకపోతే యెలా






చిత్రకారుడు : సుబ్బారావు శాస్త్రి

పుల్లయ్య మాటాడలేదు. చల్దిఅన్నం తిన్నాక యెండలో యింటికోసం వెదకటానికి బయలుదేరాడు. కొడుకు పక్కపిల్ల నెత్తుకొని వెంటబడ్డాడు. తాటాకు పాకలున్న వీధుల్లోనికి వెళ్లాడు. ఎత్తుగా వరిచొప్పతో వేసిన పాగా, గాలి తగులుతున్న యింటిలో వుండటానికి అలవాటుపడ్డాడేమో. దిగువుగా భూమికి చూర్లుతగిలివున్న యీ యిల్ల వేపు చూస్తుంటేనే మనస్కరించటంలేదు. ఇవి కూడా దొరకటంలేదు. చుట్టూ కుళ్లు కాలవ కంపు చెత్త చెదారాలు. ఎక్కడ కక్కడే మురికి—వాటిపై కుప్పలుగావాలే దోమలూ యీగలూ అంతా అసహ్యం వేసింది. మనుషులు వాటిలో యెలా మెసులుతున్నారని ఆశ్చర్యపడ్డాడు. ఒకదానివెనక ఒకటి— ఒక యింటికి నిప్పంటితే సరి ఆపేటంతా నాశనమే! తవవూర్లో యెత్తుగావున్న ఆయిళ్ళకి అగ్నిప్రమాదాలే లేవు—ఒకప్పుడు యెవడో క్రోధంతో తగిలించినా ఆర్పివేయటం యెంతో సులువు! ఇక్కడ కదల

(47- వ పేజీ చూడండి)



# సంసారంలో శారద



యద్దనపూడి
సులోచనారాణి

(గతవారం తరువాయి)

"పోనీ పోండి. యెవరిదగ్గరా మీ బెదిరింపు. ఓహో! తాటాకుల దప్పుళ్ళకి కుందేళ్లు బెదరటమూ యిది. ఈ అయిన ఖర్చంతా కూటికి గతిలేక అలో లక్ష్మణా అని యేడ్చేవాళ్ళకి దానం చేశా ననుకుంటాను; వదిలేసిపోతుంది. మాట అయితే అంది గాని. దమ్ములుంటే చెయ్యమను చూదాం. హు! ఈ పంకజమ్మ తడాఖా తెలియదు గాబోలు."

పెళ్లి పందిట్లో నిలబడి పంకజమ్మ ఆడుపులిలా గర్జించింది. యెవరూ యేమీ చెప్పలేక పోయారు. యెక్కడివాళ్ళక్కడ నిలబడి గుంపులు గుంపులుగా చేరి గుసగుస లాడుకొంటున్నారు. కొంతమంది ఇరుపక్కలా బలం సమానంగా వుందిగాబట్టి ఫలితం యేమవుతుందా అని కోస్యం చూస్తున్నారు. చివరకు శారద తల్లి ఆడబడుచు దగ్గరకువెళ్లి "ఇంత చిన్న విషయంకోసం తగాదా వద్దు వదినా. పోనీ. మనం ఆడపిల్లవాళ్ళం. కొంచం అణిగివుంటేమటుకు యేం? నువ్వు రవంత పట్టు సడలించుకోకపోతే యెలా?" అంది కళ్లనీళ్లు పెట్టుకుంటూ.

"చిన్న విషయం! ఇది నీకు చిన్న విషయంగా కన్పిస్తోందా? ఆడపిల్లవాళ్ళ మయినంతమాత్రాన యెందుకు లొంగాలి, యేం తీషరమా? అడిగినంత కట్నం మారుమాట్లాడకుండా యిచ్చాము. లాంఛనాలన్నీ ముచ్చటలా తీర్చాము, ఆ వరసనచూస్తే వాళ్ళే మనకు లొంగాలి. ఈనాడు మనం లొంగితే లొంగినట్టేనా? రేపు దాన్ని వేపుకుతినరూ? యేం ఆమాత్రం బుద్ధుండక్కర్లా. చూస్తాను యేంచేస్తారో. నువ్వు మాట్లాడకు." అంటున్న యెగిరిపడిన పంకజమ్మను చూసి శారద తల్లి హడిలిపోయింది. ఇక లాభంలేదని భర్త దగరకువెళ్ళి "పిల్లను పంపేమార్గం చూడండి." అని మొర పెట్టుకుంది. "ఆ మార్గం నాకంటె చెల్లాయికే బాగా తెలుసు" అన్నాడాయన కోలివచుటను క్రింద దులుపుతూ. తన ఆస్తంతా వ్రాసి యిచ్చి పెద్ద పెట్టున ఖర్చుచేసి ఘనంగా పెళ్ళిచేసిన పంకజమ్మకు శారదమీద ఆమాత్రపు హక్కుందని ఆయన అభిప్రాయం.

పరిస్థితి విషమిస్తోంది. శారద కసలే మంటగా వుంది. యెంతో మధురంగా నడవవలసిన ఘడియలు యిలా అయినాయి. ఒంటరితనంకోసం పైకివెళ్లింది. అక్కడ తనగదిలో దృశ్యాన్ని చూసేసరికి శారదలో అంతవరకూ బలవంతాన బిగబట్టుకున్న, కోపం, రోషం ఒక్కసారి యివతలికి దూకాయి. తను నూతనవధువు నన్న సంగతికూడా మర్చిపోయి అక్కడగదిలో తాపీగా పడక్కుర్చీలో పడుకుని చదువుకుంటున్న చంద్రాన్ని చూసి మండిపడ్తూ "క్రింద జరుగుతున్న బొమ్మలాట యెవరినిగురించి అనుకుంటున్నారు? మనిద్దర్ని బొమ్మలుగా చేసి వాళ్లిలా కొట్లాడుకుంటుంటే ఇక్కడ మీరు హాయిగా పుస్తకం చదువుకుంటున్నారా? మీరు మగవారుకారూ? మీలో పౌరుషంలేదు?"

శారద కోపంలో ఉచితానుచితాలు మర్చిపోయి మాట్లాడేసింది. ఈ ఉరుములేని హఠాత్పిడుగుల్ని చూసి మొదట చంద్రం తెల్లబోయాడు. క్షణంసేపు మూర్తీభవించిన ఆగ్రహమూర్తిలా తన యెదుట నిలబడిన శారద కళ్ళల్లోకిచూసి లేచి క్రిందకు దిగి వచ్చేసాడు. ఫలితంగా అసలు బంతులాట అనే కార్యక్రమం యెత్తివేయబడింది. ఈ విధంగా చిన్న చిన్న కలతలతో శారద పెళ్ళి అయిందనిపించారు.

సలక్షణంగానే శారద కాపురానికి వచ్చింది. ఒంటరి కాపురం పెట్టటానికి సిద్ధపస్తున్న చంద్రానితో.

"మనం ఒక్కళ్ళమూ వుండగలమా? నేను సంసారం సరిగ్గా నిర్వహించుకోగలనో లేదో. మా అత్తయ్యనో, మీ అత్తయ్యనో కొన్నాళ్ళపాటు మన దగ్గర వుంటే బాగుండదూ?" భయపడ్తున్నట్లుగా ప్రశ్నించింది శారద.

"జీవితాంతం అత్తయ్యలు మనని కనిపెట్టుకుని వుండరుగా." అన్నాడు చంద్రం నవ్వుతూ.

"యేమోబాబూ! నాకు మటుకు చాలా భయంగా వుంది."

"యేం కాలేజిల్లో స్టేజియెక్కి పోజు పెట్టి వుపన్యాసాలు యిచ్చినట్లు లేదా?" చంద్రం సగం హేళనగా, సగం వెక్కిరింతగా అన్నాడు. శారద కోపంగా భర్త ముఖంలోకి చూచింది.

చంద్రం మాటే చెల్లింది. ఇద్దరూ ఒంటరి కాపురం ప్రారంభించారు. సంసార విషయాల్లో బాధ్యతంతా శారదదే. చంద్రాన్నేది అడిగినా చెప్పడు సరిగదా కనీసం సలహాగూడా యివ్వకపోగా వెక్కిరింతగా మాట్లాడుతాడు. ఆడవాళ్ళంటే అతనికో విధమైన చులకనభావ ముందని శారద త్వరలోనే ఆకళింపుచేసుకోగలిగింది. శారద యెంతగా ప్రేమించినా, లాలించినా హద్దులు దాటి యే మాత్రమూ రానివ్వడంలేదు. శారదతో ఒక్కనాడయినా నువ్వు హృదయదేవతవనిగాని. నా జీవితం నీకు నివేదనగా సమర్పించుకుంటానని గాని అసలా విధమైన మాటలే మాట్లాడడు. ఒక్క శారదా అన్న పిలుపులోనే తనకున్న ఆత్మీయతనంతా సమ్మరించి మిగతా మాటల్లో అయిపోయి




శ్రమజీవులు

చిత్రకారుడు : యం. డి. నెల్సన్ - వీరవల్లి.

# ★ సంసారంలో శారద ★

వట్టుగా మాట్లాడేవాడు. పోనీ ఆ పిలుపులో సగం తగ్గించి, ఇతర వాటిల్లో ఆ మిగిలిన భాగం చూపిస్తే బాగుండు అనుకునేది శారద.

చదువు, సంస్కారం పుష్కలంగావున్న ఈ యువకమూర్తిలో ఈ బలహీనత ఎక్కడి దనిపించేది శారదకి. తనపట్ల భర్త ప్రవర్తనకి కోపపడలేదు. తన్ని అధికంగా చూడలేదని అభిమానపడలేదు. ఏ కారణాలవల్లో కలిగిన దురభిప్రాయాన్ని చంద్రంనుంచి తొలగించుకోవాలని నిశ్చయించుకుంది. సహజంగా చంద్రం ఏదన్నా హేళనగా, వెక్కిరింతగా స్త్రీజాతిపట్ల మాట్లాడినప్పుడు ఎదురు జవాబు చెప్పి అతన్ని తిరస్కరించాలని శారద మనసు ఆవేశపడేది. కాని దానివల్ల లాభంలేదు. సరిగదా అతనిలో అంతకు ముందున్న భావాలు మరింత బలపడతాయి అన్న భావంతో చిరునవ్వుతో చంద్రం విసరే బాణాల్ని మౌనంగా తీసుకునేది. వాటివల్ల తగిలిన గాయాలని కూడా ఏనాడూ శారద చంద్రానికి చూపలేదు.

ఒక రోజున శారద భర్తనిలా అడిగింది "యేమండీ! ఆ రోజు నే నలా మాట్లాడితే మీరేమనుకున్నారు?"

"యే రోజు?" ప్రశ్నార్థకంగా మొహం పెట్టి అన్నాడు చంద్రం.

"మీరు మరీను. ప్రతిదీ ఏమీ తెలియనట్లుగానే మాట్లాడుతారు. అది ఆరోజు. మన పెళ్ళిరోజునండి. మీరు పడుకుంటే నేను పైకి రాలా—" తర్వాత శారద చెప్పలేకపోయింది.

"ఓ! అదా. నేనావేళే మర్చిపోయా ఆ సంగతి" తేలికగా అనేశాడు చంద్రం. శారద అతని నిర్లక్ష్యానికి చిన్నబుచ్చుకుని

"యేమయినా ఆ రోజున మొహార్ చాల బాధపడిందండి పాపం."

"అదేమిటి? అది మరో ప్రకరణంలోని సమాచారమా?"

"మీరు బలేగా మాటాడుతారండి."

"అయితే త్వరగా యేదనా ప్రైజ్ ఇవ్వు మరి."

"మీ కిచ్చేందుకు నాదగ్గరేముందండి—" శారద ఏదో అనబోయింది వెంటనే చంద్రం చేయెత్తి "దయయుంచి తర్వాత మాట్లాడవద్దు" అన్నాడు. శారద నవ్వింది.

"అవును కానీ శారదా ఆరోజున మొహారున్నిసా మీ మేనత్త కూతురని చెప్పావేం?"

"మిమ్మల్ని ఏడిపించాలని." కసిగా అంది శారద.

"అవును మరి ఎవరు యేడ్చారో చివరికి?" చంద్రం నవ్వుతూ అన్నాడు.

"పోనీగాని అది వదిలేసి యిది చెప్పండి మరీ..."

"అయ్యయ్యో, వదిలి వేయట మేం ఖర్మ. ప్రియ సఖి సంభాషణ."

"అదే చెప్తుంటే ముందు ఇది చెప్పండి."

"మరో ప్రకరణంగాబోలు. ఊ కానీ."

"మీ అత్తయ్యనుగురించి మా అత్తయ్యనుగురించి మీ అభిప్రాయమేమిటి చెబుదురూ?" శారద చంద్రం కళ్ళలోకి సూటిగా చూస్తూ అడిగింది.

"అభిప్రాయమా? యేముంది? ఇద్దరూ మనిద్దర్ని కలపటానికి స్వర్గంనుంచి దిగిన దేవతలు" చంద్రం నవ్వాడు.

"మీకు ప్రతిదీ హేళనా వెక్కిరింతానూ పోనీ లెండి." శారద కోపం తెచ్చుకుంది.

"అది గాదు శారదా. నేను నిజమే చెప్తున్నాను. ఆనాడు నిజంగా మన అత్తయ్యలిద్దరూ పోటీలు పడకపోతే మనిద్దరికి పెళ్లి యేదిగాదు తెలుసా? అందుకని అంటు

న్నాను. నిజంగా వాళ్ళిద్దరిలో ఆ డంబాలు ఆపటాటోపం గనక భగవంతుడు ఆ సమయంలో పెట్టకపోయినట్లయితే నీ యీ సుందర ముఖారవిందం ఈ పాటికి యెవరి దగ్గర వుండేదో. సరే కాని సాయంత్రం పెందరాళే వస్తాను. నేనొచ్చే సరికి రెడీగావుండు సినిమాకు పోదాం." మరో మాటకు అవకాశం ఇవ్వకుండా చంద్రం వెళ్ళిపోయాడు. శారదకు హృదయకుహరం నుంచి పెద్ద నిట్టూర్పు గుండెల్ని చీల్చుకుంటూ బయటకు వచ్చింది. ప్రస్తుతం యింట్లో చేసే పనేమీ లేదు. మళ్ళా ఒంటరి జీవితపు బాధ బయలుదేరింది, యేమీ తోచటం లేదు. యేమీ తోచకపోవటమనేది కూడా ఒక జబ్బే అనిపించింది. ప్రక్కనున్న కుర్చీలో నిలబడింది తనకూ చంద్రానికి జరిగిన సంభాషణ ఒకసారి తిరిగి నెమరు వేసుకుంది. ఇది వరకంటె యిప్పుడు చంద్రంలో కొంచెం మార్పు కనిపిస్తోంది. సంసార విషయాలో తన కేదయినా తెలియక బాధ పడుతుంటే ఇది వరకులాగా నవ్వి వెళ్ళిపోవటం లేదు. నిలబడి తనకు సలహా యిచ్చి ధైర్యాన్ని యిస్తున్నాడు. ఈవిషయం శారదకు మనోబలాన్ని కలిగింప చేసింది. కాస్త కదలిక అనేది కలిగితే యెంత మార్పయినా తీసుకురావచ్చు.

శారద మనసు కాసేపు అటెగిరి యిటెగిరి మళ్లా వచ్చి ఒంటరితనంమీద వాలింది. మనసులో యీబాధ పడుతుంటే పదిమందిలో వున్నా యెక్కడో నిరవారణ్యంలో వున్నట్టే అనిపిస్తుంది. శారద లేచి యిల్లంతా సర్దటం మొదలుపెట్టింది. సర్దటం పూర్తయిన తర్వాత రేడియో పెట్టి చూచింది యేదయినా సరే విందామనే సంకల్పంతో. అందులో మా శారదకు నిరాశే యెదురయింది. అన్ని స్టేషన్లూ మూసి వున్నాయి. విసుగ్గా రేడియో మూసేసి డ్రాయరు తెరిచింది. అందులో యేవో పత్రికలు కన్పించాయి. ఒక పత్రికను తీసుకునివచ్చి కుర్చీలో కూలబడింది. తీరా చూస్తే ముఖచిత్రం కొత్తదిగా వున్నట్టు కన్పించిందిగాని అది శారద చదివిన పత్రికే. శారద దృష్టి హఠాత్తుగా ఒక వ్యాసంమీద పడింది స్మృతిపథంలో ఒకసారి వెనక్కు తిరిగి చూచుకుంది. సరీగా ఆరోజు యిలాగే తనేమీ తోచక బాధపడింది ఆరోజే యీ వ్యాసం చదివింది. అప్పుడే మొహార్ కూడా వచ్చింది. ఆలోచనలు గొలుసులు గొలుసులుగా ఒకదానివెంట ఒకటి జారాయి. పత్రిక ఒడిలో అలాగే వదిలేసి చెంపన చేయిపెట్టుకుని శారద శూన్యంలోకి చూడసాగింది. ఇప్పుడు మొహార్ కలకత్తాలో వుంది. దాని మొగుడు చాలా అందగాడే గాని వుత్తి కోపిష్టిమనిషి. ఆరోజుల్లో తనూ మొహార్ ఒక్కరోజా చూచుకోకుండా వుండలేకపోయారు. మరి యిప్పుడు కే యెవరి జీవితాలని వాళ్ళు వెతుక్కునే పనిలోబడి ఒక్కొక్కప్పుడు ఆప్తబంధువులని కూడా మర్చిపోతారుగాబోలు. ఆనాడు చంద్రం మేనత్త మొహార్ కి చేసిన అవమానం జ్ఞాపకం వచ్చింది. తన మేనత్తగూడా చాలా నీచంగా ప్రవర్తించింది. తనకోసం, తనమీద గల ఆత్మీయతచే మొహార్ అంత అవమానాన్ని సహించింది. కృతజ్ఞతాభావంతో శారద కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

ఆలోచనలోపడ్డ శారద చంద్రం రాకను గమనించలేదు. యేదో పెద్ద ఆలోచనలోనే వుందీ అనుకుని చేతిగడియారంతీసి డ్రాయరు మీదపెట్టి స్టాండ్‌మీద తువాలు తీసుకుని దొడ్లోకి వెళ్లబోతుండగా శారద యీలోకంలోకివచ్చి ఆశ్చర్యంగా "మీ రప్పుడే వచ్చారే" అంది. వెళ్తున్నవాడల్లా ఆగి వెనక్కు తిరిగి "భలే. గుడ్లు పెట్టుకుని చూస్తూ కూడా వచ్చారే అని అడుగుతున్నావా?"

(48-వ పేజీ చూడండి)




[ఉద్యోగపర్వమునుండి]

క. పగవారియింటఁ గుడిచిన, నగుఁ దమ కనుమాన మమృతమైనను దారుం
బగతురకుఁ గుడువఁ బెట్టఁగఁ, దగ దొడళుల కెప్పు డెవ్విధము వాటిలునో.

వ. నేను బగవతుండనె యంటేని.

క. అలుగుదు పాండవులకు వా, రలు నాకుం బ్రాణములు ధరావల్లభ యి
ట్టలముగఁ దమప్రాణములకు, నలుగుజనులు పగతు రగుట యనుమానంబే.

ఆ. కారణంబు లేక కౌంతేయులకు బాల్య, మాదిగాఁగఁ గీడ యాచరింతు
పుణ్యపరులు దోడఁ బుట్టువు లార్యులు, వైర మెత్తఁ దగునె వారితోడ.

వ. ఇట్లున్న మీయందఱయన్నంబులు దుష్టాన్నంబులు విదురుం డొక్కని యన్నంబు భోక్తవ్యం బని నిశ్చయించితిఁ గావున నందుఁ బోయెద నని చెప్పి యజ్ఞనపతి యనుమతి సేయఁ జనునప్పుడు తోడన బాహ్లికభీష్మాది కౌరవులును గుంభసంభవప్రముఖులైన మాన్యులును జని మాధవుతోడ మా యిండ్ల నెల్లను గానిక లాయితంబులు సేసికొని నీవు విజయం చేయుటకు నెదుళ్లు చూచుచున్న వార మని పల్కి ప్రార్థించిన నే నన్ని చోట్లకు వచ్చినవాఁడన యందఱ యర్చనలుం గైకొంటిన మీరు నిలువుం డని వారల నిలిపి విదురుగృహంబునకుం బోయిన.

సీ. సంభ్రమస్నేహనిశ్చలభక్తియుక్తిఁ బవిత్రమజ్జనము గావించి విదురుఁ
డెల్ల వంటకములు నేర్పడ బోనాలు వేర్పింప నెంతయుఁ బ్రీతి ముంద
రోజమై బ్రాహ్మణభోజనం బొనరించి సపరివారముగ విశాలరమ్య
పూతస్థలంబునఁ బుండరీకాక్షుండు దమ్ముండుఁ దాను నుత్సవ మెలర్ప

తే. సరసరంజకమహనీయసంప్రయోగ, మగు చతుర్విధహృద్యాన్న మారగించె
లలిత సంభావనామంజులంబులైన, పలుకు లెడనెడ విదురున కెలమి యొసఁగ.

వ. అతండును.

క. గోవింద సంభ్రమము సం, భావింపుము మాకు నిదియ పరమధనం బొం
డేవిధమున నీ కర్చన, గావింపం జాలువాఁడు గలఁడే యెందున్.

వ. అని మఱియు నత్యంతవినయవాక్యమ్ముల నారాధించుచుండె నిట్లు కృతాహారుండైన హరికిఁ జందనచర్చాద్యర్చనంబు లాచరించి యవ్విదురుండు కృతార్థుండై యుండఁ గవిగణక ప్రముఖనిఖిలవిద్వజ్జనంబులు గాయకపాఠకవాంశిక వైణికాది వినోదపాత్రంబులు నప్పరమేశ్వరుం గానవచ్చి ప్రొద్దు పుచ్చి యభిమతార్థంబులు వడసి చనిరి రాత్రి యగుటయుం దగిన యభ్యంతర మందిరంబున హంసతూలికాతల్పంబున భుజంగతల్పు నునిచి యతనికడ నుచితాసనంబున నుండి.

ఆ. విదురుఁ డిట్టు లనియె నిదియొక కార్యంబు, గాఁగఁ బూని యిందు రాఁగఁదగునె
దుష్టబుద్ధి నీచు దుర్యోధనుండు నీ, మాట విను నె దురభిమానఘనుఁడు.

క. వచ్చిన సైన్యంబులఁ గని, పెచ్చువెరిఁగినాఁడు ద్రోణభీష్ములలావుల్
నచ్చియుఁ గర్ణుం డొక్కఁడ, యిచ్చుఁ దనకు విజయ మనియు నెంతయుఁ బొంగున్.

వ. నీ విట వచ్చుట వినినయప్పుడు ధార్తరాష్ట్రు లందఱుం గూడంబాటి తమలో నిశ్చయించిన తెఱంగు నీశాసనం బుల్లంఘింపంగలవారు పాండునందనులకు నేమియు నీ కుందువారు దార యీధాత్రియంతయు బీఱు వోవకుండ నేలువారు వారిం గూడినరాజు లెల్లను దిగ్విజయంబునాఁడు పాండవులచేత భంగపడినవారు గావునఁ గర్ణుతో నేకార్థులమై చత్తుము

గెలుతు మింతియ కాని యొండులేదని నిశ్చయించికొనియున్నవా రట్లగుటంజేసి దుర్యోధనుండు గండు మిగిలి యున్నవాఁడు సంధి గానేరదు వారల కందఱకు నిది ప్రాప్తకాలంబై యున్నయది యెట్లును నడుగనేర్చినవారు గా రిట్లు దమ్మెఱుంగని దుష్టాత్ముల నడుమం గూర్చుండుటయు నవ్వెంగలివిత్తు లఱచు పిఱికియఱపులకు వంక లొత్తి మాఱు సెప్పుటయు నొప్పకయుండు వెడంగు లగుటం గార్యవచనంబు లెఱుంగరు మొఱకు లగుటం బ్రతాపభాష ణంబులకు వెఱవరు వారల తలంపులు గీడు నీమహనీయప్రభావబుద్ధిపౌరుషంబు లే నెఱుంగుదు నయినను గాంధ వేయులపై స్నేహంబునను నీమీఁది భక్తినిం జెప్పెద నందుఁ బోవలవ దనిన వాసుదేవుం డతని కిట్లనియె.

తే. నీ వివేకంబు నాప్తియు నెఱపి తీవు, తల్లిదండ్రులమాడ్కి హితంబు సెప్పి
తేను నారాక తెఱఁ గెల్ల నేర్పడంగఁ, జెప్ప విని యేమి సెప్పినఁ జేయువాఁడ.

## శ్రీకృష్ణుఁడు విదురుతో సంభాషించుట

క. ఎఱుఁగుదు నేను సుయోధను, కొఱగామియు నతనితోడఁ గూడిన నృపు లం
దఱుఁ బగ మనమున నిడికొని, యఱుముటయును సంధిపొసఁగ దనియు మహాత్మా.

ఆ. పుడమి యెల్ల నొడ్డగెడ వయి గజవాజి, యుతముగాఁ గడంగి యుగ్రమృత్యు
ముఖము సొరఁగఁ దివురు మూర్ఖత మాన్చుట, యధికమైనపుణ్య మనఘచరిత.

వ. మానుపవచ్చునే యంటేని.

క. దొరఁకొని పుణ్యముఁ బాపము, నరుఁ డర్థిం జేయుచుండ నడుమ నొకట న
వ్వెర వెడలి తప్పినను ద, త్పరిణతిఫల మొందు నండ్రు ధర్మవిధిజ్ఞుల్.

వ అట్లుం గాక.

తే. చుట్టములలోన నొప్పమి పుట్టినప్డు, దడ్డపడి వారితోడఁ గొట్లాడియైనఁ
దాని యుడుపంగఁ జూరకున్నవానిఁ గ్రూర, కర్ముఁ డని చెప్పుదురు కర్మకాండవిదులు.

వ కావున నీరెండుదెఱంగులవారికి శాంతి గావింపం బ్రయత్నంబు సేసెద దర్మార్థసహితంబైన తెఱంగు మాటలు మంత్రిజనసహితుం డైన సుయోధనునకుం జెప్పెదఁ దనకుం బాండునందనులకు లోకంబులకు హితం బయినవిధంబు వంచన లేక చెప్పెదు నన్ను పాండవులవాఁ డని శంకించి యతండు నామాట వినం డయ్యె నేనియు మేల కాక యిట్లు సొచ్చి చెప్పకున్న నన్నదమ్ములు దమలోనం బోరఁ గృష్ణుండు వారింపక యుపేక్షించెఁ దవచేతఁ జక్కంబడదా యని యజ్ఞు లైన జను లాడుదు రెల్లభంగుల గార్యం బార్యు లియ్యకొనం జెప్పుదు ధార్తరాష్ట్రులుం దమకు బ్రదుకుతెరువైన నాపలుకులు వట్టుదురు పట్టక నీతలంచినచందంబునం దులువలై కలగంబాఱిన వారు నాముం దర నిలువం జాలుదురే యని పలికిన విదురుం డట్లకాక యని సమ్మతించి యామంత్రణంబు సేసి విజశయనస్థానం బునకుం జనియె ననంతరంబ.

ఆ. అతనివచనరచన యాత్మలోఁ దలపోసి, యిట్టివాఁడు గలఁడె యొండు ననుచుఁ
బాల కడలికడల పాటి యై యొప్పు న, ప్పాన్పునందు శౌరి పవ్వళించె.

వ. ఇట్లు సుఖనిద్ర సేసి వేగుంబోకట మాగధమంగళగానంబుల మేలు కాంచి సమయకర్తవ్యంబులు సలిపె నట్టియెడఁ గృతవర్మయు సాత్యకియు వచ్చి పొడసూపినం బురుషోత్తముండు వారలు మొదలుగాఁ గల యిష్టజనంబులు పరి వేష్టింప నుచిత ప్రదేశంబున నున్నంత.

క. ఇనతనయశకునిదుశ్శా, సనసహితము గాఁగ నెలమిఁ జనుదెంచి సుయో
ధనుఁడు ప్రియోక్తులఁ దగువా, రును దానును వారిజోదరుం గొనియాడెన్.

వ అతండును మధురసంభాషణంబులు సేయ వార లతనికి ధృతరాష్ట్రుండు బంధుమిత్త్రాదిసమస్తపరిజనసమన్వితుం డయి పేరోలగంబున నునికి యెఱిఁగించినఁ బ్రియంబునఁ గట్టాయితం బైన తేరెక్కి భేరీశంఖచామరప్రముఖభద్ర చిహ్నంబులతో వెడలి గరుడధ్వజంబు గ్రాలఁ గృతవర్మసాత్యకు లొక్కరథంబునను దుర్యోధనాదిదుష్టచతుష్టయం బొక్కరథంబునను బార్శ్వంబుల రాఁ బౌరులకుఁ గన్నులపండువగుచు రాజమందిర ద్వారంబుసేర నరుగునప్పటి యులివునకుఁ గొలువువా రెల్ల నత్యుత్సుకులై యెదురుచూడ రథోత్తమంబు నవతరించి యరవిందనాభుండు.

తే. ఎదురువచ్చిన విదురునియిచ్చకరముఁ, దమ్మచేయును రెండు హస్తములఁ బట్టి
నడచె ముందటఁ గదియునందడిఁ గడంగి, కర్ణదుర్యోధనులు దోలఁ గంగజడియు.

వ. కృతవర్మాదియాదవులు లోనుగాఁగలయభ్యంతరు లైన బలుమానిసులు పొదివికొనిపోవఁ దనసమీపంబునఁ గౌరవులు రవిసన్నిధిఁ దారాగ్రహంబులచందం బగుచుండం దేజోరాశి యగు రాజీవాక్షుండు సని తనకుఁ బ్రత్యుత్థానంబు సేసిన కురురాజును దొరలను నభినందించుచు.

క. తన కని పెట్టిన మణిమయ, కనకోన్నతపీఠమునఁ బ్రకాశంబున ని
ల్చినయెడఁ దోఁచిరి నారద, మునిప్రముఖు లంతరిక్షమున నుజ్జ్వలు లై.

వ ఇవ్విధంబున సన్నిహితు లయిన యమ్మహామునులం గురి పితామహునకుం జూపి నారాయణుం డి ట్లనియె.

ఆ. మనలఁ జూచువేడ్కఁ జనుదెంచినారు మ,హాత్ము లైన నారదాదిమునులు
వీరి కర్ఘ్యపాద్యవిధు లొనరింపు మా,సనము లిడఁగఁ బనుపు సత్వరముగ.

వ. వీరలు సముచితాసనంబుల నుండక మనకుఁ గూర్చుండుట దగవు గా దనినం గొలువువా రెల్ల సంభ్రమాశ్చర్యంబులతో మునులవలన జూచుచుండ భీష్ముండు పరిచారకులం బనిచి కనకమణిమయాసనంబు లనేకంబులు దెప్పింప వార లరుగుదెంచిన వారలకు సమస్కరించి యాసనార్ఘ్యపాద్యాదివిధులం బూజలు సేయించి కృష్ణుఁడు గూర్చున్న యనంతరంబ ధృతరాష్ట్రుండునుం దక్కటివారును నుచితప్రకారంబుల నమ్మునీంద్రులకు నభివందనంబులు సేసి నిజాసనాసీను లైరి దుశ్శాసనుండును వివింశతియును గద్దియ లిడ సాత్యకియుఁ గృతవర్మయుఁ గృష్ణుం గదిసి యిరువంకలం గూర్చుండిరి కర్ణదుర్యోధనులుం జేరువ నొక్కగద్దియ నుండిరి విదురుండును మణిపీఠంబునఁ గృష్ణుని వెనుకదెసఁ దదీయోన్నతపీఠంబునఁ గరం బత్తమిల్లి యుండె గాంధారరాజు నిజపుత్రపరివృతుండై యొక్కదిక్కున నుచితపీఠాసీనుం డయ్యె నట్టి సమయంబున.

క. అంబుదశుభగాత్రుం బీ,తాంబరధరుఁ గమలదళనిభాక్షుఁ హరిఁ జూ
డం బడసి లోచనము లమ్మ్రు, తం బానినమాడ్కి నమ్మదంబునఁ దేల్చన్.

క. ఆకొలువువారు గర మచ, లాకృతి నొకపలుకు లేక యందఱు వింజం
బాఁ కిడినకరణి నవశ ము, దాకారితచిత్తవృత్తు లై యుండంగన్.

## శ్రీ కృష్ణుఁడు ధృతరాష్ట్రునితో సంభాషించుట

క. జలదస్వనగంభీరత, నెలుఁ గొప్పఁగ దంతదీప్తు లెసఁగ ముకుందుం
డలరుచెవుల నఖలజనం, బులు విన ధృతరాష్ట్రభూవిభున కి ట్లనియెన్.

క. జననాథ నీయెఱుంగని, పనులు గలవె యైనఁ దగవుఁ బరమహితంబుం
దనవారికిఁ జెప్పన తగు, నని వచ్చితి భారతాన్వయము ప్రియ మొందన్.

క. క్షీరోదకగతిఁ బాండవ, కౌరవు లొడఁగూడి మనికి కార్యం బది నీ
వారసి నడపుము వా రన, వీ రనఁ గురుముఖ్య నీకు వేఱుం గలదే.

చ భరతకులంబు ధర్మమును బాడియు సత్యముఁ బొత్తుఁ బెంపునుం
గరుణయుఁ గల్గి యుండు ననఁగా నుతిఁ గన్నది యందు సద్గుణో
త్తరులరు నీవు నీయనుఁగుఁదమ్ముఁడు నీతనయుల్ యశోధురం
ధరశుభశీలు రీసుచరితక్రమ మిప్పుడు దప్ప నేటికిన్.

శా. ఈవంశంబున కెల్ల నీవ కుదు రిం దెవ్వారిచందంబు లె
ట్లైన వర్తిల్లినఁ గీడు మేలుఁ దుది నీయం దొందెడుం గాన న
ద్భావం బారసి లోనిపొత్తు వెలివృత్తంబుల్ జనస్తుత్యముల్
గావింపం దగు నీక యెవ్విధమునం గౌరవ్యవంశాగ్రణీ.

చ. వినుము సుయోధనాదు లగు వీరు సధర్ములు గాక కార్యము
ల్గొనక మహార్థసిద్ధి యెడలుం దమ కి ట్లన కన్వయంబువ
ర్తన మిది గాదు నాక బెడిదంపుఁదనంబున బంధుకోటికి
న్మనసులు నొవ్వఁగా నవగుణంబులకుం బయిలోడ రేమియున్.

ఉ కౌరవపాండవుల్ తెఱఁగు గైకొని శాంతతఁ బొంది యున్కి మే
లారయ నాకు నీకుఁ గుల మంతకు నీనృపకోటి కుర్వికిం

జోరిత మైన నింతకును బుట్టు మహాపద గావునన్ ధరి
త్రీరమణా గగణ్య గణుతించి యవశ్యము బొం దొనర్చవే.

తే. నీకు వీరలఁ దీర్పంగ నేర వచ్చు, నధిప తెఱఁగు నీవశమునయదియ కాన
నీకు వీరలఁ దేర్చుట నెఱియ కాదె, సిద్ధ మెవ్వారిఁ దెలి వొందఁ జేయ నేర్తు.

ఉ. అందు వృకోదరార్జునుల నాహవరంగమునందు మీఱువా
రెందఱొ యెన్నుమా యిచట నీగురుభీష్ములఁ ద్రేణి సేయువా
రెందఱొ వారు వీరు నని నీల్గుటకంటె భవద్బలంబు లై
యందఱుఁ గూడు టొప్పదె జనాధిప శాంతి యొనర్చు మెమ్మెయిన్.

తే. జగతిఁ గలజనపతులు నీచరణపీఠ, మర్థిఁ గొలువ సముద్రవేలావృతోర్వి
యెల్ల నేలుట యొప్పదే తల్లిప్రజల, యెడ విరోధంబు వాటించు టెంతమేలు.

క. నరనాథ నీ వుపేక్షా, పరుఁడ వయినఁ గౌరవులక పాండవులక కా
దరయఁగ భూప్రజ కెల్లను, దురితం బొనరించినట్లు తుదిఁ గీడు సుమీ.

క. కౌరవపాండవులం దె, వ్వారలకుం జావు నొవ్వు వచ్చిన మే లు
ర్వీరమణ చిత్తమున ని, ట్లారయుమా నీకు దుఃఖ మగు నె ట్లయినన్.

ఉ. వీరును వారుఁ బండితులు విక్రమవంతులు బాహుగర్వదు
ర్వారులు లోనిరిత్తబవరంబున నాఁడిఁ జావఁ బోవ నె
ట్లారక యుండవచ్చు కడునొప్పెడుమేనులు వాఁడికైదువుల్
గూరఁగ నాటినం బుడమిఁ గూలుట కక్కట యోర్వ వచ్చునే.

ఆ. ఇట్లు గాక యుండ నీరెండుదెఱఁగుల, వారిఁ గాచికొనుము వసుమతీశ
నిరుపాభవంబు నీతియు శాంతియు, నఖిలజనులుఁ బొగడునట్లు గాఁగ.

వ. అని చెప్పి వెండియు.

## శ్రీ కృష్ణుఁడు పాండవులు సెప్పినమాటలు ధృతరాష్ట్రునితోఁ జెప్పుట

తే పాండవులు దండ్రిఁడినచ్చిన ప్రజలు వారి, నరసి ప్రోచితి శైశవ మాది గాఁగ
నడుమ నిష్కారణమ దిగవిడువఁ దగునె, పారమొందంగ రక్షింపు గారవమున.

వ పాండుకుమారులు నీకుం బరమభక్తిం బ్రణమిల్లి యందఱు నొక్కమాటగా నీతోఁ జెప్పు మని నాకుం జెప్పిన విధంబు వినుము తన పంపునం బన్రెండువత్సరంబులు వనంబున వసియించితిమి పదుమూఁడగు నేఁడు జనపదంబున నజ్ఞాత వాసంబునుం జరిపితిమి మాతండ్రిసమయంబు పరిపాలించి యే మర్ధరాజ్యం బెట్లునుం బడయుదు మని కృతనిశ్చయుల మై పడితిమి తల్లియుఁ దండ్రియు నెల్లచుట్టంబులు నేదుగడయును మాకుఁ దాన మావలన నేరమి గల్గినం గినిసి యిట్లు గా ద ట్లని చక్కంబెట్టునది తనగలపదిపేలేండ్లకుం దన్ను కాని మఱి యొఱుంగ మెట్టివార మైనను మమ్మును దుర్యోధనాదులనుం దలంపరు తనయందుఁ దెఱంగు గలిగిన నెవ్వరు గొఱగాకున్నను గుణంబు పాడి సెడక చెల్లు నవి రవి పలికి మఱియు ని ట్లనియె.

ఉ. సారపుధర్మమున్ విమలసత్యముఁ బాపముచేత బొంకుచేఁ
బారముఁ బొంద లేక చెడఁ బాఱిన దైన్యయవస్థ దక్షు లె
వ్వార లుపేక్ష సేసి రది వారలచే టగుఁ గాని ధర్మని
స్తారక మయ్యు సత్యశుభదాయక మయ్యును దైవ ముండెడున్.

వ. అని యీ సభ్యులకుం జెప్పు మనిరి నీవును సభాసదు లై నరాజులు నే మనియెద రనుం దేను ధర్మంబును నీతియును మున్నిడికొని మనోవాక్ప్రకారంబు లేక రూపం బై న సత్యంబ కాఁ జెప్పితి నిత్తెఱంగు మీకు మేలు క్రోధమాన మత్సరంబులు విడిచి యిట్లు సేయుండు.

ఆ. పాండవులకుఁ దగినపాలు మేదినిఁ బంచి, యిచ్చుకంటెఁ గార్యమెద్ది గలదు
ధర్మ మెద్ది సముచితం బగు విధ మెద్ది, శక్య మెద్ది చెపుఁడ వాక్యవిదులు. 





"అదుగో బుద్ధావతారం గారు వస్తున్నారు - బహుపరాక్" అని సరోజ గట్టిగా నవ్వింది.

"ఎవరికి... ఓహో ఆయనా కి... బుద్ధావతారం కాదు- బడుద్ధావతారం." అన్నది కృష్ణవేణి హేళనగా.

"ఇదేమీ కొత్తదువే - కనబడటం లేదూ ఆయన మడ్డిమృగంలాగా అపరవరాహావతారం గారు" అన్నది సరస్వతి వ్యంగ్యంగా.

"ఏమండోయ్ అవతారం గారూ - స్వాగతం-సుస్వాగతం..." అని గొల్లుమని నవ్వారు అక్కడ వున్న యువతు లందరూ.

"ఏమయ్యోయ్ పంతులూ - ఇక్కడ మేము మడివాళ్ళం-కొంచెం నిదానించూ... మీ యింట్లో పెళ్ళాం పిల్లలు యేడిపిస్తారని గొడవ లేదుగా నీకు" అన్న దొక గంగాభాగీరథి.

"ఈయన అవతారానికితోడు ఒక పెళ్ళాం కూడానా" అని మూల విరిచిం దొక ముత్తైదు.

ఇంతమంది స్త్రీల హేళనకు గురైన వ్యక్తి మాత్రం పాపం నోరెత్తి మాట్లాడలేదు. శాంతంగా ఒక మూల నిల్చొనివుండి ఆ కొళ్ళాయివద్దవున్న స్త్రీలందరూ నీళ్ళు పట్టుకొని వెళ్ళిపోయిన తర్వాత, తానొక బిందె నీళ్ళు పట్టుకొని వెళ్ళిపోయాడు.

గవర్నర్ పేటలోని ఒక వీధి కొళ్ళాయి వద్ద నిత్యసంఘటనలలో యిది ఒకటి. ఆ పేటలోని స్కూల్ టీచర్ మాధవరావు నిత్యజీవితములో కూడా యిది ఒక ఘట్టం.

మాధవరావు యెక్కడివాడో — అతనికి వా అనేవాళ్ళు వున్నారో లేదో కూడా యెవరికీ తెలియదు. ఎవరో తెలుసుకోలేదు. ఆ పేటలో ఒక చిన్న యింట్లో ఒకగది అద్దెకు తీసుకొని అందులో అతనుంటున్నాడు. ప్రతిరోజు కాలకృత్యాలయినతర్వాత కుళ్ళాయిదగ్గర రెండుబిందెల నీళ్ళు పట్టుకొని వెళ్ళి తానే స్వయంగా వంట వండుకొని స్కూలుకువెళ్ళటం అతని నిత్యకార్యక్రమం. వృద్ధనారీమణులు మొదలు నవయువతులవరకు కుళ్ళాయి వద్ద యితనిని హేళనచేస్తూ పూర్తిగా అవమానించిగాని వదిలిపెట్టేవారుగాదు. ఇక స్కూలులో విద్యార్థులతో పాఠ్య విషయాలు తప్ప యితర వ్యాసంగము చేయకుండా పాఠశాల వదిలినవెంటనే తనగదికి చేరుకొనేవాడు. సహోద్యాయు లందరికీ యితన్ని చూస్తే కొంత నిరాదరణ - హేళన వున్నా 'యింత భయస్తుడు, అచేతనుడు జీవితంలో ఎలా ముందుకు సాగిపోగలడు' అనే సానుభూతికూడా కొంత వుండేది.

మాధవరావు స్వభావములాగానే అతని జీవితంకూడా చాల మందంగానే సాగిపోతోంది. ఏకాకి జీవితంసాగిస్తూ తనకువచ్చే స్వల్ప వేతనంతో కాలం గడుపుకుంటున్న తనయందు యిరుగుపొరుగువారు చూపుతున్న నిరాదరణ, అపహాస్యము సహించటం అతనికి పోను పోనూ దుర్భరము కాజొచ్చింది. ముఖ్యంగా ఆ వీధిలోని యువతులు యితని యెడ అవలంబించిన వైఖరి యితనికి చాల బాధాకరంగా పరిణమించింది. ఇతనువీధిలో కనబడి నపుడల్లా వారు యేదో ఒకరూపంలో యితనిని విసిగిసుండేవారు. సహజంగా అనాకారి కాకపోయినా నీరుకావి పట్టి మాసినట్లు వుండే బట్టలు, తైల సంస్కారము లేని శిరోజాలు అతని ఆకారానికి అసహ్యత కలుగ జేస్తుంటాయి. నిరాడంబరమని అను కొనేందుకు వీలులేనంతటి మడ్డితనమువల్లనే అందరూ తననంతగా ఏవగించు కుంటున్నారని అతను తెలుసుకోనలేకపోయాడు.

కుటుంబశాస్త్రిగారు ఆ పేటలోనే వుండే సంస్కృతపాఠశాలలో పండితుడుగా వుంటున్నారు. ఆయన కుమార్తె పార్వతి మాత్రము మొదటినుండి మాధవరావును ఒకవిధమైన సానుభూతి దృష్టితో చూస్తుండేది. ఇతని అమాయకత్వము, నిస్సహాయస్థితి చూచి ఆమె జాలిపడేది. ఆ వీధిలోని యువతులు అతనిని విసిగిస్తున్నప్పుడు యామె చూస్తే వారిని వారింప ప్రయత్నించేది. కాని వారు యామెను కూడా ఆటలు పట్టించేవారు.

పార్వతి ఫోర్త్ఫారం చదువుతుండగా ఆమెతల్లి మరణించింది. అక్కడితో ఆమె చదువుకు స్వస్తి చెప్పి కుటుంబనిర్వహణ భారాన్ని వహించవలసి వచ్చింది. తమ్ముడు రామశాస్త్రికి చదువు సంధ్యలలో తోడ్పడుతూ, గృహకృత్యములను నేర్పుతో నిర్వహిస్తూ తండ్రికి సహాయంగా వుండేది. ఆమె అసాధారణ రూపవతి కాకపోయినా



కాంతి సహజాలతో విలసిల్లే ఆమె హృదయ సౌందర్యమే ఆమె సహజశోభను ద్విగుణీకృతం చేసింది. బాల్యమునుండి కొంత కష్టములో గడుపుతూ వుండటముచేత యితరుల బాధలను సానుభూతితో చూసే సుగుణ మామెకు బాగా అలవడింది.

ఒకరోజున ఆమె తమ్ముడితో "రామం, మన వీధిలో వుండే మాధవరావుగారు యెక్కడ వుద్యోగముచేస్తున్నారో నీకు తెలుసా?" అని అడిగింది.

"తెలియకేం......ఆయన మా స్కూలులోనే టీచరుగా వుంటున్నారు. కాని మా క్లాసుకు మట్టుకు రారు" అన్నాడు రామం.

"ఏమిటీ! ఆయన టీచరా! మరి స్కూలులో కూడా యిలాగే వుంటారా?"

"ఇలాగే వుంటారు. కాని ఆయన పద్యాలు అవి ఎంతచక్కగా చెప్తారనుకున్నావు. చాలా చక్కగా పాడ్తారు కూడాను." అన్నాడు రామశాస్త్రి.

"నీకెలా తెలుసు?" అని అడిగింది పార్వతి.

"ఈమధ్య మా తెలుగుమాష్టరుగారు రాలేదు. అందుకని మాధవరావుగారు వచ్చారు. మా మేష్టరుగారికంటే బాగా అర్థమయ్యేటట్లు చెప్పి కమ్మనిగొంతుకతో కొన్ని పద్యాలు చదివితే మాకు ఆశ్చర్యం వేసింది. ఆయన స్వయంగా కవిత్వంకూడా చేస్తారట," అన్నాడు రామం.

"అయితే నీకు ఆయనతో పరిచయం లేదా?" అన్నది పార్వతి.

"లేదు. కాని నాకు ఆయనదగ్గర కవిత్వం నేర్చుకోవాలని వుంది. ఏమంటావు" అని అడిగాడు.

"నేర్చుకో. అందులో తప్పేముంది?" అని పార్వతి సమ్మతి తెలిపింది.

తర్వాత రామంమాధవరావుతో పరిచయం చేసుకొని ఆయనవద్దకు వెళ్ళటం మొదలుపెట్టాడు. క్రమంగా వారిద్దరికి బాగా స్నేహం ఏర్పడది. ఆయనదగ్గర తాను నేర్చుకున్నవన్నీ తండ్రికీ, పార్వతికీ తెలుపు చేసేవాడు.

కొన్నాళ్ళయినతర్వాత కుటుంబశాస్త్రి గారు మాధవరావు గదిదగరకు వెళ్లారు. అప్పుడు అతను ఏదో రాసుకుంటూ కూర్చున్నాడు. శాస్త్రిగారు లోపలకువెళ్ళి "మాధవరావుగారు మీరేనాండి" అని అడిగారు.

తొట్రుపాటుతో మాధవరావు లేచి "అవునండి" అన్నాడు.

"మా అబ్బాయి రామశాస్త్రి మీదగ్గరకు వస్తుంటాడుగదండి?" అన్నారు శాస్త్రి గారు.

మాధవరావు కొంచెం భయంతో "అవునండి. కాని నాలుగైదురోజులనుండి యిక్కడకు రావడం లేదండి" అని జవాబిచ్చాడు.

"అదేనండి. ఆసంగతి చెప్దామనే వచ్చాను. వాడికి ఐదారురోజులనుంచి జ్వరము వస్తున్నది. మీ దగ్గరకు రాలేకపోయానని విచారిస్తున్నాడు. మీకు వీలుంటే ఒకమారు అతనిని చూసేందుకు మాయింటికి వస్తారా?" అన్నారు శాస్త్రిగారు.

కుటుంబశాస్త్రిగారితో మాధవరావు రామాన్ని చూసేందుకు వెళ్ళాడు. అయన్ను చూడగానే రామానికి యెంతో సంతోషం కలిగింది. అతను రామంతో మాట్లాడుతుండగా పార్వతి అక్కడకు వచ్చింది. శాస్త్రిగారు ఆమెను మాధవరావుకు పరిచయం చేస్తూ "ఈమె మా అమ్మాయి పార్వతి," అన్నాడు.

"అలాగా" అన్నాడు మాధవరావు తలపైకెత్తకుండానే.

"ఫోర్త్ ఫారం ప్యాసయింది. ప్రస్తుతం యింట్లోనే వుంటున్నది."

"అలాగా" అన్నాడు మాధవరావు.

"సంస్కృతమంటే చాల యిష్టం. రఘువంశం, మేఘసందేశం-కాళిదాస శాకుంతలం మొదలైన గ్రంథాలు చదివింది" అన్నారు శాస్త్రిగారు.

"అలాగా" అన్నాడు మాధవరావు మళ్లా.

"కావ్యాలన్నా, నవలలన్నా, కథలన్నా చాల యిష్టం. ఎప్పుడూ ఏదో వకటి చదువుతూనే వుంటుంది.

"అలాగా" అన్నాడు మాధవరావు నేల మీదినించి దృష్టి తియ్యకుండానే. పార్వతికి మాధవరావు ఏక పద సమాధానానికి చాల నవ్వొచ్చింది. అతని మౌన స్వభావాన్ని చూసి చాల ఆశ్చర్యపడ్డది. తర్వాత యెన్నాళ్ళవరకో అతని యీ 'అలాగా' అనే వాక్యం ఆమె చెవుల్లో ప్రతిధ్వనిస్తూనే వుండేది.

మాధవరావు తమ యింటికి వచ్చికూడా తనవైపు ధైర్యంగా తలెత్తి చూడలేకపోయాడు. తర్వాత ఒకటి రెండుసార్లు తమ యింటిమీదుగా వెళ్తుండగా తానే అతనిని పలకరించింది. అతను బెదురుతూనే సమాధానమిచ్చి తలవంచుకొని వెళ్ళిపోయాడు. ఇంత అమాయక వ్యక్తిమీద ఆమెకు యీమారు నిజంగానే జాలేకాక ఒక విధమైన అనురాగంకూడా కలిగింది.

స్త్రీ సహజమైన కారుణ్యం ఆమెలో నిద్రాణమైవున్న ప్రేమభావాన్ని జాగృతం చేసింది. ప్రేమ-ఆదరణ లేక నిరాశా వాతావరణంలోవున్న అతని కుడ్మ జీవితాన్ని వికసింపచేయాలనే దృఢ



# ★ రాళ్లలోని రత్నం ★

—ంకల్పము ఆమెలో కలిగింది.

* * *

ఆదివారం సెలవు కావటంవల్ల మాధవరావు తన గదిలోనే పడుకొని ఏదో చదువుకుంటున్నాడు. ఇంతలో తలుపుమీద మెల్లిగా యెవ్వరో తటిన శబ్దము విని లేవకుండానే "ఎవరూ?" అని అడిగాడు.

"నేనే" అనే కంఠస్వరం బైటనుంచి వచ్చింది. ఆ "నేను" అనేది ఎవరైంది తెలియక తను లేచివెళ్ళి తలుపు తెరిచాడు.

అతని యెదురుగా శాస్త్రిగారి కుమార్తె పార్వతి నిలచివుంది. అతను చాలా సిగ్గుపడ్డాడు—కొంచెం కంగారుకూడా పడ్డాడు. ఏం మాట్లాడాలో తెలియక తలవంచుకొనే "మీరా?" అనిమాత్రం అనగలిగాడు.

"ఆ-అవును నేనే" అన్నది పార్వతి ధైర్యంగా లోపలికివస్తూ అతని యీ కంగారును చూచి నవ్వుకుంటూ.

మాధవరావు అగమ్యగోచరస్థితిలో పడిపోయాడు. సామాన్యంగా కొత్తవాళ్ళతో-అందులో ముఖ్యంగా స్త్రీలతో-మాట్లాడేందుకే తగని బిడియపడే అతను యిప్పుడు ఒంటరిగా ఒక యువతితో ఎలా సంభాషణ సాగించాలో బోధపడక ఆమెవంక బెదురుచూపులు చూస్తూ నిల్చుండిపోయాడు. అతని స్థితి పార్వతి వెంటనే గ్రహించింది.

"మాష్టరుగారూ మీతో పనుండి వచ్చాను. మీకిప్పుడేమైనా తీరిక వుంటుందా?" అని నవ్వుతూ అడిగింది.

"నాతోనా?...పనా?...తీరికా?... ఎందుకూ?...నాకు...ఆ... వుంటుంది... వుందిలెండి..." అని కంగారుగా అస్పష్టంగా గొణుగుతూ జవాబిచ్చాడు.

ఇతని గాబరాచూసి పార్వతి వస్తున్న నవ్వును బలవంతంగా అపుకుంటూ "ఎందుకు మాష్టరుగారు మీ రంత కంగారుపడ్తారు? నేను మీకంటె చిన్నదాన్నేగా" అన్నది.

ఏమి సమాధానమీయాలో తెలియక మాధవరావు అమాయకంగా "మీరు నా గదిలోవుండగా యెవరైనా చూస్తే..." అన్నాడు.

"మరేం పరవాలేదండీ — మీరాభయం ఏమీ పెట్టుకోవద్దు. మీవల్ల ఎవరికీ ఏమీ ప్రమాదం జరగదని అందరికీ ధైర్యమే. అందుకనే నేను మీదగ్గర పాఠం నేర్చుకోవాలని వచ్చాను. నేనిప్పుడు "మేఘసందేశం" చదువుతున్నాను. నాకందులో కొన్ని శ్లోకాలు సరిగా తెలియటంలేదు. మా నాన్నగారి నడిగితే వారికి తీరికలేదని మిమ్మల్నడిగి తెలుసుకోమన్నారు. మీకు శ్రమలేకపోతే నాకు వాటికి అర్థాలు చెప్తారా?" అని వినయంగా అడిగింది.

ఇప్పటికి మాధవరావు భయం కొంతవరకు తీరిపోయింది. "అలాగే చెప్తాలెండి—మీరు నిల్చొనేవున్నారు. కూర్చోండి" అన్నాడు. కాని యెక్కడకూర్చోవాలో చూపేందుకు వీలులేకుండా వున్నది ఆ గది. అతని ఆకారానికి తగ్గట్టుగానే ఆ గదికూడా ఒక తీరూ తెన్నూ లేకుండావున్నది. సరిగా వూడ్చి యెన్నాళ్ళో అయినట్లున్నది. ఎక్కడ చూసినా దుమ్ము—సాలీడుగూళ్ళు బూజు-మాసిపోయిన గుడ్డలు-పనికిరాని కాగితాలు, వస్తువులు యివన్నీ యెక్కడివక్కడ పడివుండి ఒక శిథిలసత్రంలాగా వున్నది. తన మంచంమీద గందరగోళంగా పడివున్న గుడ్డలన్నీ ఒక మూలకు తోసి తువ్వాలతో దాని నాశ్రయించిన దుమ్మును దులిపి ఆమెను కూర్చోమన్నాడు. ఇదంతా పార్వతి మాట్లాడకుండా చూస్తూనేవున్నది. అతను కూడా ఒక కుర్చీపీట తెచ్చుకొని కూర్చొని ఆమె కోరిన శ్లోకాలకన్నిటికి చక్కగా అర్థాలుచెప్పాడు. ఆమె యెంతో శ్రద్ధగా నేర్చుకొని వెళ్ళిపోయింది.

నాలుగైదురోజుల కొకసారి పార్వతి మాధవరావు గదికివచ్చి సంస్కృత పాఠాలు నేర్చుకొని వెళ్తుండేది. క్రమంగా అతనికి పార్వతిదగ్గర బిడియం తగ్గి కొంత చనువు యేర్పడ్డది. పార్వతి వచ్చినప్పటినుండి అతనిలో కొంత మార్పు కనపడసాగింది. ఒకసారి పార్వతి వచ్చి ఆ గదినంతా శుభ్రంగా ఊడ్చి, బూజుదులిపి పనికిరాని వస్తువులను తీసేసి యెక్కడి సామానులక్కడ చక్కగా అమర్చింది. శాస్త్రిగారు కూడా అప్పుడప్పుడు మాధవరావు వద్దకు వచ్చి కొంతసేపు కాలక్షేపంచేసి వెళ్తుండేవారు. క్రమంగా ఆ కుటుంబంవారితో మాధవరావుకు బాగా సన్నిహిత స్నేహమేర్పడింది. రామం పార్వతి సూచనమీద మాధవరావు బట్టలు తీసుకొని వెళ్ళి శుభ్రంగా యిస్త్రీ చేయించి యిచ్చాడు. శుభ్రంగా తల దువ్వుకొని మంచి బట్టలు ధరించి వెళ్తుండే మాధవరావును పిల్లలు వెనుకటిలాగా ఆటలు పట్టించటం తగ్గించారు. కొళాయివద్ద స్త్రీలు కూడా యీ మార్పుకు తగ్గట్టుగా కొంత గౌరవము చూపుటకు మొదలుపెట్టారు. మాధవరావుకు యిప్పుడొక మంచి అంద ఏర్పడ్డది. అతనిలో ఒక విధమైన ఆత్మవిశ్వాసము-వికాసము కలిగింది. ఉదాసీనంగా వుండే అతని ముఖంమీద యిప్పుడు మందహాస రేఖ లొక నూతన తేజాన్ని చేకూర్చినయి.

మాధవరావు ఒకరోజు తనగదిలో వంటప్రయత్నంలో కూర్చొని వున్నాడు. ప్రశాంతత అతని ఉత్సాహాన్ని రెకెత్తించింది. గొంతెత్తి యేదో రాగాలాపనచేస్తున్నాడు. మధురస్వరంలో గానప్రవంతి ఉరకలెత్తుతూవుంటే అతను ఆనంద తన్మయతలోవున్నాడు. సరిగ్గా అదేసమయంలో పార్వతి అతని గదిలోకి వచ్చింది. కాని అతను గమనించలేదు. అతని యీ గంభీర కంఠ మాధుర్యాన్ని విని ఆశ్చర్య చకితురాలైంది. మంత్రముగ్ధలాగా వింటూ నిశ్శబ్దంగా నిల్చున్నది. కాని అతని దృష్టి యీమెపైన పడిన వెంటనే అతను యేదో దెబ్బతిన్నవాడిలాగా లేచి సిగ్గుతో తలవంచుకున్నాడు. అతన్ని యేదో వకరకమైన భయము బిడియము ఆవహించాయి. ఇది చూచి పార్వతి నవ్వుతూ "మాష్టరుగారు_

నేను మిమ్మల్నొక ప్రశ్న అడుగుతాను. సరిగా సమాధానం చెప్తారా?" అని అడిగింది.

మాధవరావు వింతగా చూస్తూ "ఏమో నాకు తెలిసిందైతే చెప్తా" నన్నాడు.

"ఏమీ లేదండి మాష్టరుగారూ—మానవ జీవితంలో యెక్కువ విచారకర విషయ మేమిటో చెపారా?" అని అడిగింది.

ఈ ప్రశ్నకు ఎలా సమాధానం చెప్పాలో అతనికి తోచలేదు. ఆలోచిస్తూ మౌనంగా వుండిపోయాడు. ఇక యెక్కువసేపు అతనిని ఆస్థితిలో వుంచటం యిష్టంలేక పార్వతి "మీకు తెలియక పోతే నేనే చెప్తాను. నా దృష్టిలో అలాంటి విషయ మేమిటంటే యే వ్యక్తి అయినాసరే తనలోవుండే శక్తి సామర్థ్యాలను తెలుసుకోలేక పోవట మేనని తోస్తోంది." అన్నది.

మాధవరావు యీ సమాధానము వినికూడా ఆ ప్రశ్న విన్నప్పుడు యెలా వున్నాడో అలానే స్తబ్ధంగా వుండిపోయాడు. అతనికి యీ వివరణకూడా పూర్తిగా బోధపడలేదు. పార్వతివైపు ప్రశ్నార్థకంగా చూస్తూ వూరుకున్నాడు. మళ్లా పార్వతే వివరణ చేసింది "మాష్టరుగారు—మీ అమాయకత్వం చూస్తుంటే నాకు చాల విచారంగా వుంది. ఈ కాలంలో చాలమంది తమలో యేలాంటి శక్తి సామర్థ్యాలు లేకపోయినా తామే సర్వసమర్థులైనట్లు వ్యవహరిస్తుంటే కొందరు తమశక్తి తాము తెలుసుకోలేక అనవసరంగా అవస్థపడుతుంటారు. అజ్ఞాతంగా అణగివున్న యిలాంటి శక్తులను బహిర్గతము చేసుకొని సక్రమంగా వినియోగించుకుంటే గాని అవి రాణించవు," అన్నది పార్వతి కొంచెం గంభీరంగా.

మాధవరావుకు ఆమె మాటలు యింకా పూర్తిగా అర్థంకాలేదు. ఈమాటు కొంచెం ధైర్యంగా "మీ అభిప్రాయ మేమిటో నాకు సరిగా అర్థం కావటంలేదు. ఇంకా కొంచెం స్పష్టంగా చెప్తే సంతోషిస్తాను," అన్నాడు.

పార్వతి మాధవరావును సమీపించి "మాష్టరుగారూ, నేను ముఖస్తుతిగా మాట్లాడేదాన్ని కాను. మీ మధురకంఠస్వరము విని నేను నిజంగా చాల ఆశ్చర్యపోయాను. ఇంత చక్కని గాత్రాన్ని సరియైన గానసాధనతో మెరుగుపెట్టి దానిని మీ రెందుకు సదుపయోగ పరుచుకోనరాదు?" అని అడిగింది.

మాధవరావుకు యిప్పుడు భయము పూర్తిగా తొలగిపోయింది. "మీరు చెప్పేది బాగానే వున్నది. కాని నాకు గాన సాధనకు తగిన గాత్ర మున్నదా? ఈ రోజున మీరు చెప్పేంతవరకు నా కంఠస్వరం బాగుంటుందని నాకు తెలియదు," అన్నాడు.

"అందుకే నేను చెప్పింది మీ శక్తి సామర్థ్యాలు మీరు తెలుసుకోలేక పోతున్నారని. ఇప్పటికైనా మించిపోయిందేమీ లేదు. మీరు కొంచెం శ్రద్ధ శ్రమ తీసుకుంటే త్వరలోనే మీకు గాన నైపుణ్యం కలుగుతుంది," అన్నది పార్వతి.

"గానకళ అంటే ఒక్క గాత్రం వుండగానే సరిగాదు. దానికి శాస్త్రీయ పద్ధతిలో సక్రమ శిక్షణ, నిరంతర సాధన—అన్నిటికిమించి అవకాశం వుండాలి. అలాంటిది నా బోటి బీద బడిపంతులుకు సాధ్యమా?" అన్నాడు మాధవరావు.

"మాష్టరుగారూ మీరు పెద్దవారు. మీకు ఎక్కువగా చెప్పటం నాకు భావ్యంకాదు. అయినా చెప్పక తప్పదు. అవకాశాలనేవి మనకు వాటంతట అవిరావు. మనమే వాటిని కలుగజేసుకోవాలి. కొంత శ్రమ తీసుకుంటే మీకు అలాంటి అవకాశము కలుగుతుంది. మా నాన్నగారికి యిక్కడి సరస్వతీ గాన పాఠశాలవారితో బాగా పరిచయముంది. వారితో చెప్పి మీకు అక్కడ గాన సాధనకు అవకాశం కలుగజేయుమంటాను. మరి మీరుకూడా కొంత శ్రద్ధ తీసుకోవాలి—తెలుసా?" అని పార్వతి అడిగింది.

"మీరు నా హితవుకోరి చెప్తున్నందుకు సంతోషం. కాని యీపని నాకు సాధ్యము కాదేమోనని సంకోచంగావుంది. మరి ఆ పాఠశాలకు జీతం...?" అని మాధవరావు తన అనుమానాన్ని వెల్లడించాడు.

"జీతం విషయంలో మా నాన్నగారు వారితో మాట్లాడి ఏదైనా సదుపాయం కలుగజేస్తారు. కాని మీరుమాత్రం యిలా నిస్పృహతో వుంటే కాదు. ఏ పనైనాసరే పట్టుదలగా సాధ్యమవుతుందని పూనుకొని ధైర్యంగా చేసుకుంటూపోతే అది తప్పకుండా నెరవేరితీరుతుంది. అంతేకాని యీ పని నావల్ల సాధ్యముకాదేమోననే సంకోచంతో చేస్తే అది అలాగే అవుతుంది. అందువల్ల మీరు కొంచెం కష్టపడి అయినా సరే సాధనకు పూనుకోండి. మిగతా అన్ని సంగతులు నేను మా నాన్నగారు చూసాము," అని చెప్పి పార్వతి వెళ్ళిపోయింది.

మాధవరావు కొంతసేపు అలాగే ఆశ్చర్యంతో ఆలోచిస్తూ కూర్చున్నాడు.

* * *

వారంరోజుల తర్వాత మాధవరావు సరస్వతీ గానపాఠశాలలో గాన శిక్షణ ప్రారంభించాడు. శాస్త్రిగారి సూచన ననుసరించి పాఠశాలాధికారులు మాధవరావు పరిస్థితికి తగిన వేతన సదుపాయము కలుగజేసారు. సంగీత కళయందుగల అభిమానము వల్ల యెంతో దీక్షగా వుత్సాహంతో కృషిచేసి ఆ పాఠశాలాధికారుల ఆదరాభిమానాలను చూరగొన్నాడు. అచిరకాలంలోనే శాస్త్రీయసంగీతంలో మంచి నైపుణ్యం సంపాదించాడు. సహజ మధుర గాత్రానికి సుశిక్షిత సాధన మంచి వన్నె తెచ్చింది.

ఆ సంవత్సరం పాఠశాల వార్షికోత్సవం జరిగింది. పాఠశాలాధికారులు కార్యక్రమంలో మాధవరావు సంగీతకచేరికూడా యేర్పాటుచేశారు. నగర ప్రముఖులు, గాన కళాభిమానులు చాలామంది యీ వుత్సవానికి వచ్చారు. మాధవరావు గానపాండిత్య మందరిని ముగ్ధులనుచేసింది. పాటకచేరి తర్వాత సభాధ్యక్షుడు మాధవరావు విషయము ప్రస్తావించి స్వల్పకాలములో యింత చక్కని పాండిత్యము పొందినవారి శ్రద్ధాసక్తులు చాల ప్రశంసనీయమని, అట్టివారికి తగిన ప్రోత్సాహము నిచ్చి తమ కళాభిమానము చూపదలచినామనియు, తమకుగల పలుకుబడి నుపయోగించి వీరికి రేడియో కార్యక్రమాలలో అవకాశము కలుగజేసేందుకు ప్రయత్నిస్తామని తెలియజేశారు. పాఠశాలాధికారులు కూడా తమ సంతోషాన్ని వ్యక్తపరుస్తూ మాధవరావుకు ఒక ఫిడేలు బహూకరించారు. అతను వినయపూర్వకంగా దానిని స్వీకరించి తనయందు వారందరు చూపిన ఆదరాభిమానాలకు తన కృతజ్ఞత తెలియచేశాడు. ఈ రోజునుండే మాధవరావు జీవితంలో పురోగమనయాత్ర ప్రారంభమైంది.

ఇప్పుడు తనలోని శక్తిసామర్థ్యాలు ఇత

(43-వ పేజీ చూడండి)

# నక్షత్ర ఫలితాలు

(7-5-58 మొదలు 13-5-58 వరకు)

బి. నరసింగరావు

### గ్రహ స్థితి

<table>
<tr><td>బుధ</td><td>రవి</td><td></td><td></td></tr>
<tr><td>కు</td><td colspan="2" rowspan="2">9 తేదీని బుధుడు మేషములో ప్రవేశించును. 11 తేదీనుండి మట్టితో గాని, కర్రతో గాని, రాయితో గాని గృహనిర్మాణమును ఆపవలెను. ధనుర్మకర, కుంభ, మీనములలో చంద్రుడు.</td><td></td></tr>
<tr><td></td><td></td></tr>
<tr><td>శ</td><td></td><td>రాహు</td><td></td></tr>
</table>

### * అశ్విని [చూ, చే, చో, లా] *

ఈ వారము అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. కోర్టువ్యవహారములు అనుకూలిస్తవి. ఎక్కువ శ్రమపడిన మీదట యత్న కార్యములు ఫలిస్తాయి. పరోపకారమునకు సిద్ధపడి పనుల ఒత్తిడిచే, చేయలేక నిందలు పొందుతారు. ఇచ్చిపుచ్చుకొనేచోట వివాదములు వస్తవి. ఉద్యోగస్తులకు అధికారుల ఒత్తిడి 11, 12 తేదీలలో వున్ననూ తోటివారి సహకారముచే సర్దుబాటుగా వుంటుంది. వర్తకులకు నిరాశగా వున్నా వారమంతా స్వల్పముగా లాభము వుంటుంది. 12 న భార్యకు అనారోగ్యమువల్ల చింత.

### * భరణి [లీ, లూ, లే, లో] *

మీ ఆలోచనలు, కార్యరూపములోకి వచ్చిందికి ఆటంకములు కలిగినా పట్టుదల గలవారగుటచేత నిరుత్సాహపడకుండా ప్రయత్నించి తుదకు కార్యసిద్ధిని పొందుతారు. మీకువున్న డబ్బు సమయమునకు ఖర్చులకు లభించక పోవుటచేతను ఋణము చేయవలసి వస్తుంది. అయిననూ వారాంతమునకు తీర్చకలుగుతారు. ఆత్మీయులకు సహాయము చేసావని మాటయిచ్చి నెరవేరక నిందలపాలవుతారు. యంత్రములవల్లగాని, వాడిగల పనిముట్లవల్లగాని, అగ్నివల్లగాని 11, 12 తేదీలలో కలిగే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. భూస్వాములకు, ఇంజనీరింగు శాఖలో ఉద్యోగస్తులకు, లోహపుసామాను, రంగుల వ్యాపారస్తులకు వారమంతా కష్టముతో కూడిన యోగము వుంటుంది.

### * కృత్తిక [ఆ, ఈ, ఊ, ఏ] *

ఈ వారము మీకు యోగకాలము అధికారుల సహాయమునకు, బంధు సహాయమునకు బుద్ధిబలముతోడై మీకు ఇదివరకు కలుగుచున్న ఆటంకములను గడిచి ఫలము పొందుతారు. ధనాదాయము తృప్తికరముగా వుంటుంది. వైద్య, జ్యోతిష శాస్త్ర ప్రసంగాలు చెస్తారు. కవులు నూతన రచనలు ప్రారంభిస్తారు. ఈశాన్య దిక్కునుండి ఆత్మీయుల కుశలవార్త తెలుస్తుంది. కవులకూ. శిల్పులకు, నటీనటులకు యోగకాలము. 7, 8, 9, 10. తేదిలలో ధనాదాయము, బంధు సహాయము కార్యానుకూలత మొదలగు శుభయోగములు కలుగుతాయి. 12 న అధిక ఖర్చులు, అలసట 13 న పండిత ప్రసంగము.

### * రోహిణి [ఓ, వా, వీ, వూ] *

ఈ వారము మీకు భాగ్య యోగము ఎక్కువ. ఉన్న ఇబ్బందులు తీరిపోతవి. అనుకున్న సొమ్ము చేతికి వస్తుంది. కోరు వ్యవహారములు అనుకూలముగా తీర్పు అవుతాయి. పిల్లల సుఖ సంతోషాలకై చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. పండితులతో శాస్త్ర ప్రసంగాలు చేయుటచే మీ విజ్ఞానము అభివృద్ధి పొందుతుంది. ఉపాధ్యాయులకు, పండితులకూ, న్యాయవాదులకు మంచి కాలము. 7, 8, 9, 10 తేదీలలో భాగ్యవృద్ధి, కార్యానుకూలత, ధనలాభము. 11, 12 తేదీలో బంధుల రాకపోకలు, అధిక ఖర్చులు 13 న పండితగోష్ఠి.

### * మృగశిర [వే, వో, కా, కీ] *

ఈ వారము మీ ఆర్థికస్థితి వృద్ధి అవుతుంది. బంధుమిత్రులతో కూడి కవులతోనూ గాయకులతోనూ, వినోదిస్తారు. ఇంట్లో వారారోగ్యము కోలుకుంటారు. దూరమందున్న ఆప్తుల కుశలవార్త తెలిసి ఆందోళన తొలుగుతుంది. నూలు, బట్టలు, ప్రత్తి, వెండి నగలు, బియ్యము వ్యాపారస్తులకు లాభయోగము. కవులకూ, గాయకులకూ, నటీనటులకు వారమంతా యోగకాలము. 13 బంధు సమాగమం, వినోదము, మృష్టాన్న భోజనము.

### * ఆరుద్ర [కూ, ఖ, జ, ఛ] *

ఈ వారము మీకు గత వారము కలిగిన యోగము వృద్ధి అవుతుంది. అసంపూర్తిగా నిలిచిపోయిన పనులు లాభకరముగా ముగుస్తాయి. విద్యార్థులకు పరీక్షలలో జయము కలుగుతుంది. నూలు, బట్టలు, బంగారము, వజ్రములు మొదలగు వాడైన సరుకుల క్రయ విక్రయములలో వర్తకులకు లాభము. 7 8 9 10 11 తేదిలలో తీరికలేని కార్యక్రమము, ధనలాభము, యత్నకార్యసిద్ధి, స్త్రీలతోనూ ఆప్తులతోనూ విందు, వినోదము. 12 అధిక ఖర్చులు. 13 న శుభవార్త, శయ్యాసుఖం.

### * పునర్వసు [కే, కో, హా, హీ] *

ఈవారము శ్రమతో కూడిన కార్యక్రమమువల్ల తీరుబడి వుండదు. యత్నకార్యములకు ఆటంకములు కలుగుతాయి. ఆర్థికస్థితి సరిగా వుండనందున గృహావసరములు తీరక యిబ్బంది అవుతుంది. అకాలభోజనమువల్ల ఆరోగ్యము భంగమవుతుంది. ఔషధసేవ వెంటనే చేయుట మేలు. వర్తకులకు శ్రమ ఎక్కువ. ఉద్యోగస్తులకు ఒత్తిడి వున్నా కార్యరంగములో అధికారుల మెప్పును పొందుతారు. వారమంతా ఒకేరీతిగావున్నా 12 న అలజడి యెక్కువ. 13 కార్యలాభము.

### * పుష్యమి [హూ, హే, హో, డా] *

ఈ వారము మీకు మిశ్రమయోగము. మొదట్లో నిరాశగా ఉన్నప్పటికి మిత్రసహాయమువల్ల క్రమేణా కార్యలాభము పొందుతారు. ఉద్యోగస్తులకు ధనలోపమువల్ల ఆందోళన. వర్తకులకు మాంద్యము. విద్యార్థులకు పరీక్షలలో జయం తప్పక. రహస్యములను కనిపెట్టుటలో సఫలులౌతారు. నిరాశ, గృహకలతలు, మనోవ్యధవంటి అవయోగములున్ననూ, ప్రయాణము, మిత్రసహాయము, కార్యసిద్ధి విదేశీయులతో పరిచయము విచిత్రవస్తుసంపాదన వంటి లాభయోగములు కూడా కలవు. 12 న ఆప్తుల ఆరోగ్యచింత.

### * ఆశ్లేష [డి, డూ, డే, డో] *

ఈ వారము బంధువుల రాకపోకలవల్ల అధిక ఖర్చులు, తలపెట్టిన పనులకు ఆటంకములు. గృహ కలతలవల్ల మనోవ్యధ వుంటుంది. పీఠాధిపతులవంటి మతగురువుల బోధనలవల్ల మనోవికాసము కలుగుతుంది.

ఉద్యోగస్థులు కొంత శ్రమపడినమీదట మేలు పొందుతారు. వస్త్రద్రవ్య లాభము కలుగుతుంది. వారమంతా ఆటంకములు, అధికఖర్చులు గృహకలతలు వున్నా సాధు సాంగత్యము, ఆత్మవిశ్వాసము, ధనలాభము వంటి మంచియోగములు కూడా కలుగు తాయి. 12 వ ఆరోగ్యచింత.

### * మఖ [మా,మీ,మూ,మే] *

ఈ వారము మీకు కార్యభారముఎక్కువ. పరోపకారము చేయుటకు శ్రమపడి కూడా మాటదక్కక చింతిస్తారు. ఆర్థికస్థితి బాగుం డక కిందామీదా పడతారు. కోర్టు వ్యవ హారములు లాభిస్తాయి. ఇచ్చి పుచ్చుకొనే వల్ల వివాద పడతారు. భార్యకూ ఆరోగ్యము సరిగా వుండక కలవరపడతారు. ఆటంకములు వివాదములు వంటి అవయోగములున్నా వారమంతా కార్యానుకూలత, ధనలాభము వంటి శుభయోగములు కూడా వుంటాయి. 12 వ ఆరోగ్యచింత.

### * పూర్వఫల్గుణి (పుబ్బ) *
### (మో, టా, టీ, టూ)

ఈవారము ఉత్సాహముతో కార్య సాధనకు ప్రారంభించినను ఆటంకము కలిగినా అధైర్య పడక ప్రయత్నించి తుదకు సాధిస్తారు. రాబడి చాలక ఖర్చులు ఎక్కువగుటచే గృహావసరములు తీరిందికి ఋణముచేస్తారు. ఎత్తైన ప్రదేశము నుండి పడుటవల్లగాని, వాహనములవల్లగాని అవయవములకు దెబ్బలు తగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. ఖనిజములు లోహములు వ్యాపారస్థులకు, గనుల యజమానులకు, భూస్వాములకు శ్రమ తో కూడిన లాభము వారమంతా వుంటుంది. 12 వ ప్రమాద సూచన. 13 వ ధనయోగము.

### * ఉత్తరఫల్గుణి (ఉత్తర) *
### [టే, టో, పా, పీ]

ఈ వారము మీకు బంధుదర్శనం, విద్యా ప్రాప్తి, వ్యవహారములలో జయము. ధన లాభము, శుభవార్తలను వినుట, నూతన కార్యప్రయత్నలాభం, జ్ఞానమార్గ ప్రసం గము, మంచి ఉత్తరములు వచ్చుట, యుక్తి గా వ్యవహరించుట, సుఖభోజనము, గణిత జ్యోతిషశాస్త్రముల ప్రసంగములు వంటి శుభయోగములు కలుగును. ప్రత్తి, నూలు, ఇత్తడి, బంగారము, కంచు మొదలగు వస్తువుల వ్యాపారస్థులకు లాభము. వారమంతా కవులకు, శిల్పులకు మేలుకాలము కలుగుతది.

### * హస్త [పూ, ష, ణ, ఠ] *

ఈ వారము మీ దేహారోగ్యము బాగుం డుట, చేయుకృషి వృద్ధియగుట, ధనలాభము నూతన ఉద్యోగలాభము, దేవబ్రాహ్మణ భక్తి, పుణ్యక్షేత్ర సంచారము, పుణ్యకార్య ములు చేయుట పుత్రసంతాన ప్రాప్తి, గృహమందు శుభకార్యములు జరు గుట, బిరుదులను పొందుట, ఆకస్మిక రాజ సన్మానము, సుఖజీవనము, వైద్యజ్యోతిష శాస్త్ర ప్రసంగములు, ఘనకార్య ప్రయ త్నములవంటి శుభయోగములు కలుగును. విద్యార్థులకు పరీక్షలలో జయము కలుగును. ఉపాధ్యాయులకు, పండితులకు, న్యాయ వాదులకు వారమంతా యోగకాలము.

### *చిత్త [పే, పో, రా, రీ]*

ఈ వారము మీరు తెల్లని వస్తువులను కొనుట, నీటిప్రయాణము, తలచిన కార్య ములలో జయము, దధిక్షీర మధుర పదార్థ యుక్త సుఖ భోజనము వెండిపాత్రలలో భుజించుటవంటి యోగములు కలుగును, విద్యార్థులకు పరీక్షలలో జయమువుండును. తెల్లని వస్త్రములు, ప్రత్తి, దూది, నూలు, ద్రవపదార్థ వస్తువులు వ్యాపారస్థులకు లాభము వారమంతటావుండును. 12వ నిలకడ లేనిస్థితి. 13 వ ధనయోగము. కవులకు, గాయకులకు, నటీనటులకు యోగకాలము.

### * స్వాతి [రూ, రే, రో, తా] *

ఈ వారము క్రయవిక్రయాగులవలన లాభము, వివాహాది శుభకార్యములలో పాల్గొనుట, స్త్రీసౌఖ్యము, కృషీయూల ముగా లాభము, ధనధాన్యవృద్ధి, పసుసంపద, ఇష్టవస్తులాభము కలుగును. విద్యార్థులకు పరీక్షలలో జయము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము వారమంతా వుంటుంది. 12 వ వివాదము, కుటుంబకలహము కలుగును. 13 వ ధన లాభము.

### *విశాఖ [తీ, తూ, తే, తో]*

ఈ వారము మీకు ఏమంత యోగ కాలముకాదు. యత్న కార్యములకు ఆటం కాలు వస్తాయి. కార్యభారము ఎక్కువ. అనుకున్నట్టుగా డబ్బు రానందున అవసర ములు తీరక ఇంట్లో అసంతృప్తి కలుగు తుంది. వేళతప్పిన భోజనమువల్ల, తలపోటు, కళ్ళమంట వంటి లక్షణములు కనబడగానే అవుషధసేవ చేయుట మేలు. ఉద్యోగస్థులకు కొత్త సమస్యలు. వర్తకులకు ఆందోళన. విద్యార్థులకు పరీక్షలలో జయము తక్కువ. 7, 8, 9, 10 తేదీలలో కార్యభంగము ఆటంకములు, శ్రమ కలిగినను, పితృవర్గము నుండి సహాయము, కార్యసిద్ధికూడా వుంటాయి. 12 వ ఆరోగ్యభంగము. 13 వ లాభయోగము.

### —ధరలు :—

నూలు, వస్త్రములు: సమ స్థాయిలో వుండును.

నూనె దినుసులు: సులభమగును.

బెల్లము, పంచదార, చింతపండు: మార్పు లేదు.

ఆహారధాన్యములు: నిలబాటుగా వుండును.

పప్పుదినుసులు : సులభమగును.

వెండి, బంగారము: స్వల్ప తేడాలో వుండును.

ఎండలు మెండుగా వుండును. అచ్చ టచ్చట గాలితో కూడిన వర్షములు పడును.

* * *

జన్మనక్షత్రము బట్టిగాని, జన్మనక్ష త్రము తెలియనివారు నామనక్షత్రము (వారి వారి పేర్ల ననుసరించి పేరు మొదటి యక్షరము)ను బట్టిగాని ఫలి తాలు తెలుసుకొనునది. కృష్ణుడను పేరునకు మృగశిరా నక్షత్రమును, హృషుడను పేరునకు స్వాతియు, శ్రీధరు డను పేరునకు చిత్తయును, క్షేత్రపాలకు డనే పేరునకు హస్తయును, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢ యును చూచుకొనునది.

### *అనూరాధ [నా, నీ, నూ, నే]*

ఈ వారము అనుకున్న సొమ్ము సకాల ములో చేతికిరాదు. ఏ పని చేసిందికి నిశ్చ యము లేనిస్థితిలో వుంటారు. తలపెట్టే పను లకు మొదట్లో ఆటంకాలు కలిగినా, వారాం తమునకు మిత్రసహాయమువల్ల కార్యసిద్ధిని పొందుతారు. వర్తకులకు నిరాశగావున్నా వారాంతమున లాభము. విచిత్రవస్తు సంపా దన, అన్యదేశీయులతో పరిచయము కలుగు తుంది. 12 వ ఇంట్లో వున్నవారి ఆరోగ్య భంగమువల్ల మనోవ్యధ. 13 వ లాభ యోగము.

### *జ్యేష్ఠ [నో, యా, యీ, యూ]*

ఈవారము మీకు మిశ్రమయోగము. అనుకున్నట్టుగా పనులు జరగవు. ధనలోపము వుంటుంది. కోరిన సహాయము లభించదు. అవసరములు తీరక ఆందోళన కలుగుతుంది. దైవముపై భారమువేసి కార్యసాధనకు ప్రయత్నించి ఫలమును పొందుతారు. వర్త కులకు మొదట్లో త్రిప్పట ఆశాభంగము. వారాంతమున లాభము. 8 9 10 తేదీలలో పుణ్యపురుషుల సాంగత్యము, కాంతి, లాభము, 12 వ ఇంట్లోవున్న పెద్దవారి



# నక్షత్రఫలితాలు

ఆరోగ్యము సరిగా వుండనందున ఆందోళన 13 న ఆధ్యాత్మిక చింత.

### * మూల [యే, యో, బా, బి] *

ఈవారము అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. కోర్టు వ్యవహారము అనుకూలమైనా, మరి కొన్ని కొత్తవి తలెత్తుతాయి. ఇచ్చి పుచ్చుకొనేచోట వివాదాలు వచ్చి మనోవ్యధ కలుగుతుంది. భార్య ఆరోగ్యము చెడే సూచనలున్నవి. విద్యార్థులకు పరీక్షలలో జయము తక్కువ. అపరదినుసులు, మినుములు, నువ్వులు వుప్పు నూనె సంబంధము వస్తువుల వ్యాపారస్తులకు లాభము. ఇతర జాతీయులవల్ల గౌరవము కలుగుతుంది. 8 9 10 తేదీలలో శ్రమతో కూడిన కార్యానుకూలత. 12 న ఆరోగ్యచింత. 13 న విజాతీయులచే గౌరవము.

### *పూర్వాషాఢ [బూ, ధ, ఫా, ఢ]*

ఈ వారము ఎంత ప్రయత్నించినా కార్యసాధనలో అనేక ఆటంకాలు కలుగుతాయి. సాహసము, పట్టుదలగలవారగుటచే నిరాశ చెందకుండా చిక్కులను విప్పుకొని మేలు పొందుతారు. సోదర సహాయమువల్ల ఒడిదుడుకులు సద్దుకుంటాయి. జాగ్రత్తగా వుండుటవల్ల అవయవములకు దెబ్బలు తగిలే ప్రమాదము తప్పవచ్చును. కార్యభంగము, మనోవ్యధ మొదలైన బాధలున్నా 8, 9, 10 తేదీలలో సోదర సహాయము, కార్యానుకూలత, శుభయోగము కలుగుతాయి. 12 ప్రమాద సూచన. పోలీసు, ఇంజనీరింగు శాఖలలో ఉద్యోగులకు శ్రమతో కూడిన యోగము.

### *ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]*

ఈ వారము మీకు యోగదాయకము. మీ యుక్తిచేత కార్యసాధనలో విజయమును పొందుతారు. అధికారుల సహాయము కలుగుతుంది. నూతన వ్యక్తులు పరిచయమవుతారు. ఈశాన్యదిక్కునుండి బంధువులకు కుశలవార్తవింటారు. జ్యోతిష, గణిత శాస్త్రజ్ఞులకు కళాకారులకు, కవులకు యోగకాలము. విద్యార్థులకు పరీక్షలలో జయము కలుగుతుంది. 8, 9, 10 లలో ధనలాభము. కార్యసిద్ధి, మిత్రలాభము, కుశలవార్త. 12 న ఆందోళన. 13 న కవులు నూతన రచనలు ప్రారంభిస్తారు.

### *శ్రవణము [జూ, జే, జో, ఖా]*

ఈ వారము మీకు యోగప్రదము. గత వారము అసంపూర్తిగా వుండిపోయిన కార్యములు ఈ వారములో సానుకూలమవుతాయి. రాబడితోపాటు అధికారము కూడా పెరుగుతుంది. పండితగోష్ఠివల్ల, ఉత్తమగ్రంథ పఠనవల్ల విజ్ఞానాభివృద్ధి అవుతుంది. 8, 9, 10 లలో ధనలాభము, కార్యానుకూలత, సంతానముయొక్క క్షేమాభివృద్ధి. 12 అలసట, నిలకడలేని స్థితి. 13 న వర్తకులకు లాభము. విద్యార్థులకు పరీక్షలలో జయము.

### *ధనిష్ఠ [గా, గీ, గూ, గే]*

ఈ వారము మీరుచేసే ప్రయత్నములన్నీ అన్ని రంగములలోనూ అనుకూలముగా ఉంటవి. ఆర్థికస్థితి బాగుంటుంది. బంధుమిత్రులతో కలిసి కవితాగోష్ఠి, గాన సభలు మున్నగు వినోదములలో పాల్గొంటారు. ఇంట్లోవారి ఆరోగ్యము బాగుపడుతుంది. దధిమధుర పదార్థములతో వెండి పాత్రములలో సుఖభోజనము చేస్తారు. విద్యార్థులకు మేలు కాలము. నూలుబట్టలు వెండి బియ్యము వ్యాపారస్తులకు లాభము. 8. 9, 10 తేదీలలో ధనలాభము కార్యసిద్ధి. కవులకు గాయకులకు నటీనటులకు యోగకాలము. 12 న ఆందోళన, 13 న వినోదము విందు.

### * శతభిషం [గో, సా, సీ, సూ] *

ఈవారము మీ ఆదాయము అనుకున్నదానికన్నా ఎక్కువగా పెరుగుతుంది. యత్నకార్యములు ఫలిస్తాయి. సాంఘిక కార్యములలో కీర్తిగాంటారు. దూర ప్రయాణము చేయవలసి వుంటుంది. శుభకార్యాలోచనలు బంధుమిత్రులతో విందు, వినోదము జరుగుతవి. వర్తకులకు విలువగల సరుకుల క్రయవిక్రయాలలో లాభము విద్యార్థులకు యోగకాలము. కవులకు గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలు కాలము. 7, 8, 9 10, 11 తేదీలలో ధనలాభము, ప్రయాణము కార్యసిద్ది శుభకార్యాలోచన, విందు, వినోదము, శయ్యాసుఖము. 12 న శ్రమ. 13 న రాజకీయ వ్యవహారజయము.

### *పూర్వాభాద్ర [సే, సో, దా, దీ]*

ఈవారము కార్యభారము ఎక్కువ. రాజవార్తా ప్రసంగములు, వింత వార్తలు వినుట, పరాక్రమమువల్ల ఘనత, ధనలాభము, ప్రయాణము వుండును. అకాల భోజనమువల శరీరములో వేడిచే బలహీనత, కడుపునొప్పి, నేత్రపీడ కలుగును. అవుపన సేవచేయుట మేలు. ఉద్యోగస్తులు బదిలీ అగుటగాని లేక ఒత్తిడి పడలేక శలవుపెట్టుటగాని జరుగును. విద్యార్థులకు పరీక్షలలో జయము తక్కువ. 8, 9, 10 లలో ఘనత, కార్యలాభము, ధనయోగము, ప్రయాణము. 12 న అనారోగ్యము, అధికారుల ఒత్తిడి. 13 న వింత వార్తలు వినుట.

### * ఉత్తరాభాద్ర [దూ, శం, ఝా, థా] *

ఈవారము ఏపని చేసిందికి సమాధానము కుదరక చికాకు పడవలసి వస్తుంది. ప్రతి ప్రయత్నమునకు అనవసరముగా జాప్యము కలుగుతుంది. ఆశాభంగము ఎక్కువ, లాభముతక్కువగా వర్తకులకూ వుంటుంది. రహస్యముల కనుక్కొనే చాతుర్యమువల్ల జయము పొందుతారు. ఉద్యోగస్తులకు వన పర్వత ప్రాంతములకు శిక్షకొరకు బదిలీ అవుతుంది. వారాంతమున విదేశీయుల సహాయమువల్ల కార్యానుకూలత కలుగుతుంది. 12 న చంచల మనస్సు. 13 న కార్యలాభము, విద్యార్థులకు పరీక్షలలో జయము తక్కువ.

### * రేవతి [దే, దో, చా, చీ] *

ఈవారము మీరు ఎవరి సహాయంతో పనులు నెరవేర్చుకుందామనుకుంటున్నారో అవ్యక్తివల్లనే మీకు ఆటంకములు కలుగుతాయి. ధనాభావము ఎక్కువగా వుంటుంది. ఆధ్యాత్మికచింతకలవారగుటచేత ఈశ్వర కృపవల అన్ని కష్టములు తీరుతాయనే నమ్మకమున్నందున మీకు క్రమేణా కార్యానుకూలము కలుగుతుంది. ఇంట్లోవారి ఆరోగ్యం ఆందోళన కలుగజేస్తుంది. ఉద్యోగస్తులకు ఒత్తిడి, వ్యాపారస్తులకు నిరాశ. విద్యార్థులకు జయము తక్కువ. 8, 9, 10 సాధుసాంగత్యము, ఆత్మశాంతి. 12 ఆరోగ్యచింత. 13 న కార్యలాభము. ★



# వనితాలోకం

## "అమ్మ"

అమ్మలగన్నయమ్మ,
ముగురమ్మల మూలపు
టమ్మ, చాల పెద్దమ్మ,
దయాంబురాశివిగదమ్మ ... ...

* * *

అని ఎంత మధురంగా వర్ణించారు! ప్రపంచమంతటా ప్రతి అణువునా అమ్మ శబ్దం వినుపిస్తూనే వుంటుంది. తెల్లవారి ప్రక్క మీదనుంచి లేవకముందే పనిమనిషి పిలుపు, "అమ్మా! అంట్లుపడెయ్యండి;" ఇంకా అమ్మా పాలు, అమ్మా పెరుగు, అమ్మా కూరలుకావాలా? ఇలాటి వెన్నో సార్లు, ఎంతమంది నోటితోనో పిలిపించుకొంటుంది మాతృమూర్తి. అమ్మ! ఇటువంటి పవిత్రమైన పిలుపుకోసమేకదా పిల్లలులేని స్త్రీలు పరితపిస్తుంటారు! పిల్లలున్నవాళ్ళ సంగతి వర్ణించక్కరలేదనుకుంటాను. కానీ! కొంతమంది తల్లులు తాము కన్న బిడ్డలచేతనే అమ్మా అని పిలిపించుకోక, అక్కా అని, తండ్రిని బావా అనీ, లేక అక్కయ్యా, మామయ్యా అని పిలిపించుకుంటారు. తలిదండ్రులను ఇలా పిలుస్తుంటే కొంచెం ఆశ్చర్యం వేస్తుంది.

చిన్నపిల్లప్పుడు, అలవాటయితే అప్పుడే మాన్పించాలి; కాని 15, 16 సంవత్సరాలొచ్చినా తల్లిని అక్కా అని, తండ్రిని బావా అని పిలుస్తుంటే జ్ఞానం వచ్చినవాళ్ళు కదా ఆ పాటి అలవాటు మానలేరా అనిపిస్తుంది.

దానికితోడు, ఏడుగురు, ఎనమండుగురు పిల్లల తల్లులైనా వాలుజడ, నుదుట చిన్న తిలకం దిద్ది లంగావోణీలు వేసుకుని, తనంత ఎదిగిన పిల్లలచేత అక్కా అని పిలిపించుకొంటుంటే, నిజంగా వాళ్ళకి అక్కా కాబోలనిపిస్తుంది. మేమువచ్చిన క్రొత్తలో అలానే అనుకున్నాము. ఒకసారి ఆవిడే మాయింటికొచ్చింది. నేనుండబటలేక అడిగాను, ఏమండీ. అలా పిలుస్తున్నారేమిటని. దానికి, ఆమె సమాధానం: నేను పురిటికి, మా పుట్టింటికెళ్ళినపుడు, మా చెల్లెళ్ళూ తమ్ముళ్ళూ అలాపిలుస్తుంటే అదే అలవాటయిపోయింది. పెద్దపిల్లలు, యేమని పిలుస్తే, తక్కిన పిల్లలంతా అదేమాదిరి అలవాటు చేసుకున్నారు. నాకు ఇలా అనిపించింది. రేప్రొద్దుట పిల్లకి పెళ్ళీడొచ్చింది. పెళ్ళిచేస్తే, ఆ అత్తవారూ భర్తా ఏమనుకుంటారు? ఆక్షేపించరా? ఆమె యేమైనా అనుకుంటుందేమో అని సంశయిస్తూనే అడిగాను.

ఎస్. యామినీ పూర్ణతిలక

తనకిద్దరు తమ్ముళ్ళున్నారట ఎవరికో ఒకరి కివ్వదల్చుకుంటున్నామని చెప్పింది. బాగానే వుందనుకున్నాను. మరిబాధలేదు. తమ్ముడూ, అక్కా, బావా, అని పిలుస్తాడు; కూతురుకూడా, అక్కాబావా అని పిలుస్తుంటే విన్న చుట్టాలకు, బంధువులకి మహాగమ్మత్తుగా వుంటుందనుకున్నాను. భేతాళుడు విక్రమార్కుడికి కథ చెప్పి, యిట్లాగే ఎవరికెవరు ఏమౌతారని ప్రశ్న వేస్తే మహామేధావిగనుక అతను వెంటనే చిక్కు సమస్య విడదీసి చెప్పాడు. అలాగ ఈ వరుసలు యెలా తెలుసుకుంటారు వచ్చిన చుట్టాలు, వాళ్ళూ!

ఇంకా కొంతమంది అమ్మమ్మలు తమ పిల్ల సంతానంచేత వాళ్ళ అమ్మను పేరు పెట్టో లేక, అక్కా అనో పిలిపిస్తారు. ఎందుకంటే, చిన్నపిల్ల అప్పుడే దానికి సంతానమిచ్చేడు భగవంతుడు. దాని పిల్లలు, దానిని అమ్మా అని పిలిస్తే దిష్టికాదాను. అప్పే అదెంత చిన్నపిల్లమ్మా! మొన్న మొన్నటివరకూ లాగూ గౌనూ వేసుకొనేది కదూ! పదకొండేళ్ళకే పెద్దమనిషైంది.. పన్నెండేళ్ళకి పెళ్ళిచేసి కాపురానికిపంపిస్తే పదమూడో ఏట, పిల్లను పుట్టేను అని వస్తుంది. తల్లికిపిల్ల యెప్పుడూ చిన్నదే అవుతుంది. పుట్టిన పిల్లలు పెరక్కుండా వుండిపోరుకదా! ఇంకా చిన్నవాళ్ళమే అని ఎనమండుగురు తొమ్మండుగురు పిల్లల తల్లులైనా వాలు జడలూ, లంగావోణీలు వేసుకుని తయారయితే ఎదురుగా కాకపోయినా వెనకనైనా ఆక్షేపిస్తారు.

వెనకటికొక, పెళ్ళికొడుకు పిల్లనిచూడానికి పెళ్ళిచూపులకివెళ్ళాడట. అమ్మాయేమో నల్లగావుంటుంది, తండ్రిలాగ. తల్లి తెలుపు. దానికితోడు, చిన్నవాళ్ళమాదిరి ముస్తాబై వచ్చిన తల్లిని చూచి, పెళ్ళికొడుకు, ఆమెనే పెళ్ళికూతురనుకున్నాడట. చివరకు వాళ్ళు పెద్దలడిగితే ఆ నల్లపిల్ల నాకొద్దు అనీ పిల్లకన్నా పిలతల్లే బాగుందనీ అన్నాడట. అందుచేత ఏ విధమైన ఆక్షేపణలకీ గురికాకుండా పిల్లలకి చిన్నతనంనుంచే ఏవిధమైన పిలుపులూ అలవాటు కాకుండా తల్లులు చూచుకోవాలి. మూడునాలుగు సంవత్సరాల వయస్సుగల పిల్లలు తండ్రి యెలా పిలిస్తే అలానే పిలుస్తుంటారు. అప్పుడే కొప్పడి మానిపించాలి. అంతేకాని ఎంత చిన్నవయస్సులో పిల్లలు పుటినా, అమ్మా, అని పిలిపించుకోడానికి ఎటువంటి ఆక్షేపణా వుండకూడదు. అందులో, ఇప్పుడు, 18, 20 సంవత్సరాలొచ్చేవరకూ, ఆడపిల్లకి పెళ్ళేతలపెటడంలేదు. అటువంటప్పుడు పిల్లలు పుట్టడానికి వయస్సు చాలకపోవడమంటూ వుండనే వుండదు.

# అడుగడుగునా అవహేళనలను ఎదుర్కొనే అభాగినులు!



భర్తృవియోగం ఒక పాశ్చాత్య మహిళకే అంత దుస్సహ మనిపించినపుడు ఇక మన భారతీయ మహిళల సంగతి వేరే చెప్పాలా? వాస్తవానికి కష్టంలో, సుఖంలో, కర్తవ్యంలో కలసి, మెలసి జీవితయాత్ర సాగిస్తున్న దంపతులలో ఏ ఒక్కరు అనురాగ బంధాలు త్రెంచుకొని శాశ్వతంగా కన్నుమూసినా రెండవవారి జీవితం శూన్యమే అవుతుంది. డెబ్బది సంవత్సరాల పాటు మనసు విప్పి చెప్పుకున్నా, ఇంకా ఎన్నో విషయాలు మిగిలిపోయాయని ఎవరో దంపతులు అన్నారట!

సంకుచితమైన సామాజిక నియమాలు, స్త్రీని చులకనగా చూచే పక్షపాత వైఖరీ, అజ్ఞానమూ, మూఢాచారాలు, ఇవన్నీ కలసి వైధవ్య జీవితంలో స్త్రీ బ్రతుకును మరింత దుర్భరంగా చేస్తున్నాయి. భర్త మరణించడంతోటే, భారత మహిళ స్వరూపమే మారిపోతుంది. కేశాలంకరణ, వస్త్రధారణ, చేతిగాజులు, నుదుటిబొట్టు, కంటికాటుక మొదలైన అలంకారాలన్నిటికీ ఆమె దూరమౌతుంది. విరియబూసిన తంగేడులా కళకళ లాడుతుండే ఆమెరూపం మోడులా, మొద్దులా మారిపోతుంది!

మరిక, భర్త చనిపోయిన తరువాత కర్మకాండలనాడు చేసే తతంగాలన్నీ చూస్తే, హృదయమూ, వివేకమూ ఉన్నవారి కెవరికైనా కడుపులో చేయిపెట్టి కలియబెట్టినట్లవక మానదు. పసుపు రాసి, బొట్టుపెట్టిన ఆమె ముఖం ఊరి వారందరికీ, చూపించాలి. ఒక వేళ ఆమె తనదుఃఖములో తన ముఖాన ఉన్న ముసుగు తొలగించకపోతే, హేళన చేసి మరీ అడుగుతారు ముసుగు తీయమని! ఇలాగే ఇంకా ఎన్నెన్నో తతంగాలు చేస్తారు!

కర్మకాండలన్నీ అయాక, ఆమెను దేవాలయంలోకి తీసుకు వెళ్ళుతారు. అక్కడి నుంచిగాని-పుట్టింటికి తీసుకు వెళ్ళరు. అక్కడ కూడా ఊరివారంతా పనిగట్టుకుని తను క్షేమంకోసం వచ్చి, ఆమెముఖం ఒకసారి చూస్తారు!

## మా పినతల్లి కూతురు

మా పినతండ్రిగారమ్మాయికి భర్త చనిపోతే, బెజవాడవచ్చి కృష్ణానదిలో స్నానం చేయించి దేవాలయానికి తీసుకువెళ్ళారు. ఇంతలో పుండపోతగా వర్షం కురిసింది. ఇంటికి వెళ్ళటానికి వీలు లేక పోయింది. ప్రొద్దుకూకింది. ఆ దేవాలయపు ధర్మకర్త గారి భార్య మా చెల్లెల్ని చూడటం తటస్థించింది. వెంటనే ఆమె అక్కడినుంచి వెళ్ళిపొమ్మని గద్దించింది. అక్కడే ఓ చిన్న ఇంట్లో పూజారి కాపుర ముంటున్నాడు. పూజారిభార్య కాసేపు తమఇంట్లో తల దాచుకొమ్మని, తరువాత ఆమె వెళ్ళిపొయ్యాక దేవాలయం వరండాలో పడుకోవచ్చునీ చెప్పింది. వారు అలాగే చేశారు. కాని ఆ ధర్మకర్త భార్య ప్రొద్దుపొయ్యాక లైటు తీసుకుని తనిఖీ కొచ్చి నిల్చుని మరీ వెళ్లగొట్టింది. కారుచీకటి, వర్షం, ఎక్కడికి పోవాలి? బెజవాడలో చాలామంది బంధువులున్నారు. కాని వాళ్ల ఇళ్లకి పోవడమెలా? అందరికీ అనుమానమే! మేము కూడా బెజవాడలోనే కాపుర ముంటున్నాము. నేను మొదట్లోనే మా ఇంటికి రమ్మనమంటే మీ అత్తగారికైనా, మీ ప్రక్కవాటాలో వారికైనా పట్టింపు ఉంటుందేమో అన్నారు. నిజానికి మా అత్తగారికీ, ప్రక్కవాళ్ళకేగాదు మా అమ్మగారికి పినతల్లిగారికి కూడా అనుమానమే. స్వయంగా మా పినతల్లిగారే తన బిడ్డను దేవాలయంలో దీపారాధన చేయకుండా ఇంటికి తీసుకు వెళ్ళటానికి ఇష్టపడలా, తమ కుటుంబానికేదో అనర్థకం వస్తుందనే భయంకొద్దీ. దురదృష్టవశాత్తూ ఏ కుటుంబాలలోనైనా ఎక్కువ మందికి భర్తృవియోగం తటస్థిస్తే, "వాళ్లు పాపిష్ఠి వాళ్ళు! వాళ్లందరికీ అంతేరాత!" అని చాటుగా అనేస్తారు. పెండ్లి అయిన వెంటనే భర్త చనిపోతే, ఆమె పాదమే పాపిష్ఠిపాదం అని సాధిస్తారు కోడల్ని! వాళ్ల పిచ్చి కూలిపోను; ఒక్క మాంగల్యం తెగుతుంటే వెయ్యి మాంగల్యాలు కదులుతాయట!! అందుకని మాంగల్యాలకు పసుపుకొమ్ము కట్టుకుంటారు. అలా చేస్తే తమ భర్తల ప్రాణాల కేమీ అపాయ ముండదని వీరి విశ్వాసం.

పట్టణాలలోనూ, ప్రత్యేక సంస్కారం గల కుటుంబాలలోనూ ఈ మూఢాచారాలను అంతగా పాటించకపోవచ్చు. కాని ఏదిఏమైనా ప్రొద్దుటేలేస్తే, తెల్లపంచెలతో తల్లులుగానీ, అమ్మమ్మలుగానీ, అక్కచెల్లెళ్ళుగానీ ఎదురయ్యారా అంటే అశుభమనే అనేకమంది విశ్వాసం.

## "మాఖర్మ ఇలాకాలింది"

మొన్నీమధ్య, ఒకరోజు నేను ప్రయాణమై వీధిలోకొచ్చే సరికల్లా, ఇద్దరు బ్రాహ్మణస్త్రీలు ఎదురయ్యారు. వారివి కేశఖండన చేసిన తలలు. అందులో ఒకామె నాగడ్డం పట్టుకొని "తల్లీ! తిట్టకమ్మా. పాపిష్ఠివాళ్ళం ఎదురయ్యాము. మాఖర్మిలా కాలిపోయింది! ఎంతో భయపడుతూనే వస్తామమ్మా. ఎక్కడ ఎవరి కెదురౌతామోనని, అంది. వారి కేమనిజవాబివ్వాలో నాకు తోచిందికాదు. ఒక్కసారిగా వారి కాళ్ళ

తాకి నమస్కరిద్దా మనిపించింది. కాని అదీ చేయలేక పోయాను. గొంతు పెగిలింది కాదు, మాట్లాడదామంటే. కళ్ళనిండా నీళ్లు మాత్రం క్రమ్మాయి. అదే వారికి నా జవాబు!

మా పినతల్లికి సుమారు ఇరవై సంవత్సరాలకే భర్తృవియోగం తటస్థించింది. అప్పటికే ఆమెకో కుమార్తె కలిగింది. ఆమెకు వైధవ్యం ప్రాప్తించాక నాలుగు సంవత్సరాలకు ఒక తిరునాళ్ళకు వెళ్ళటం జరిగింది. అక్కడ ఆమెకు ఇష్టమయిన చీర కనపడిందట షాపులో. భర్త చనిపోయేముందు ఆమె ఆ చీర కొనుక్కోవాలని ఎంతో ఉబలాటపడిందట. చీర చూడగానే ఆమె తనస్థితి మరచిపోయి, నేనీ చీర కొనుక్కుంటానక్కా అందట. మా అమ్మగారి కళ్ళవెంట జలజలా కారే కన్నీళ్ళు చూచాక ఆమెకు తనస్థితి గుర్తుకొచ్చిందట! మరిక, ఆమె అక్కడ నిలబడలేక పోయిందిట.

మరొకామె ఈ మధ్య తన వైధవ్య జీవితంలోని బాధల్ని గురించి చెబుతూంటే ఇలాంటి కష్టగాథలు వింటే రాళ్ళుకూడా ద్రవించక మానవే, మరీ మానవహృదయాలు రాళ్ళకంటే కఠినమైనవా?" అనిపించింది.

ఈడూ, జోడూ లేని ఓ క్షయరోగికిచ్చి పెండ్లితంతు పూర్తిచేస్తే, ఆ మహానుభావుడు కొద్దిరోజులకే చనిపోయాడట. ఆమె చాల అందమయినది. తరువాత కొన్నాళ్ళకు ఆమె నగలు పెట్టుకొని, రంగుబట్టలు కట్టుకుంటే, పెద్దలు తమ ప్రతిష్ఠ పోతుందని భయపడి, ఆమె నా ప్రయత్నాలనుంచి మరల్చారు. తమ ప్రతిష్ఠకోసం ఇంతటి పెనుగులాట సాగించిన పెద్దలలో ఒకరు కండ్లు మిరిమిట్లుకొల్పే ఆమె యౌవనాన్ని అందాన్ని దొంగతనంగా అనుభవించటానికి ఎన్నో వ్యర్థ ప్రయత్నాలు చేశారట!

మా నాన్నగారు ఓమాటు ఏరువాక విత్తనాలు చల్లడానికి వెళ్ళుతుంటే మా మేనత్త ఎదురయింది. నాన్నగారి ముఖవర్చస్సు మారిపోయింది! ఆమెకు భర్త లేరు. నాన్నగారి ముఖంలో వచ్చిన అసంతృప్తి ఆమె నెంతగానో బాధపెట్టింది. కాని తానలా ఎదురయినందువలన ఏదో అశుభం కలుగుతుందనే విశ్వాసంమాత్రం ఆమెకూ ఉంది.

## సిటీ పోలీసులు!

వంచకులందరూ కలసి తాను కొన్న మేకను 'కుక్క' అని పదేపదే చెప్పేసరికి నిజమేనేమో నని నమ్మిన బ్రాహ్మణుని కథ గురుకొస్తుంది, మన స్థితిని చూస్తే. భర్త చనిపోయిన తరువాత తమ ముఖాలు పాపిష్టివని, వాటిని చూచిన వారికేదో అనర్థకం కలుగుతుందనీ నమ్ముతూ వచ్చారు తరతరాలుగా. నేటికీ అదే విశ్వాసం లేకపోలేదు. రాత్రింబవలు కష్టపడతారు. మనకు కమ్మగా వేళకు తినబెడతారు. మనంకనే బిడ్డల్ని సాకుతారు. మన సుఖమే వారికి పరమావధి. ఇంతా చేస్తే, వీరిముఖాలుమాత్రం చూడతగని కావు! అమంగళమూ, అశుభమూ కాపురం చేసుందక్కడ! వొదిగి వొదిగి మూల తిరుగుతూంటారు. "బోడిముండలు"



విరిసిన అందం
చిత్రకారుడు : వీరిశెట్టి అచ్యుతరావు, పుల్లేటికుర్రు

# అవహేళనల నెదుర్కొనే అభాగినులు

"విధవముండలు," ఇంకా ఎన్నో బిరుదులతో వీరిని గౌరవిస్తూంటాము నిత్యమూ. శిరఖండన గావించబడ్డ తల్లులకి ఈమధ్య మన పుత్రరత్నాలు, పైగా విద్యార్థి రత్నాలు కూడాను (అంటే అందరూ కాదు లెండి) ఓ క్రొత్తబిరుదిచ్చారట—"సిటీ పోలీస్ లట."

వయసులో వున్న వారికి భర్తృ వియోగం సంభవిస్తే అమెరికన్ మహిళకు అర్థరాత్రి వేళ వచ్చిన పిలుపుల్లాటి వాటితో ఆమెపడే బాధ ఇక చెప్పనక్కర్లేదు! వేటకుక్కల్లాంటి కళ్ళు ఎప్పుడూ వెంటాడి వేధిస్తూనే ఉంటాయి! ఈ సందర్భంలో పురుషుల్ని రెచ్చగొట్టే విశృంఖలులైన స్త్రీలు కూడా కొందరున్నా, వారి సంఖ్య చాలా పరిమితం. పోతే వైధవ్య జీవితం ఇంత దుర్భరం కావటానికి గల కారణాలేమిటి?

హిందూ సమాజంలో వివాహం ఓ పవిత్రమైన సంస్కారం. జీవితంలో దానికో మహత్తరమైన బాధ్యత ఉంది. మనవారు ఈ వివాహ బంధాన్ని జన్మాంతర బంధంగా కూడా భావిస్తుంటారు. పాశ్చాత్య దేశాల్లోలాగా, చీటికీ, మాటికీ తెగతెంపులు చేసుకుని, ఇష్ట మొచ్చినన్ని పెళ్ళిళ్ళు చేసుకునే విశృంఖలత్వానికి తావు లేదిక్కడ. విశిష్టమయిన నైతిక సూత్రాలు సమాజానికి జీవశక్తులుగా పనిచేస్తాయనటంలో సందేహమేమీ లేదు.

'పవిత్రత' అనేశబ్దం చాలా గౌరవప్రదమయినదే. కాని వివాహ సంస్కారానికి సంబంధించిన ఈ 'పవిత్రత' అనే భావాన్ని ఆచరణలో స్త్రీలనే అమలు జరపమని శాసించింది సమాజం. మన వివాహ సంస్కారంలోని 'పవిత్రత' కంతటికీ బాధ్యత వహించవలసింది స్త్రీయే. ఆమె ఆ జన్మాంతమూ మనోవాక్కాయ కర్మలన్నింటా ఈ 'పవిత్రత' అనే పరిధి దాటకుండా బ్రతకాలి. భర్తమరణానంతరం కూడా తాను దాంపత్య జీవితంలో పాటించిన విధినిషేధాలన్నీ అమలుజరుపవలసిందే. పైపెచ్చు ఆమెకు అప్పుడు శ్వాస పీల్చుకునే స్వేచ్ఛకూడా లేదు.

## అష్టావక్రనీతి సూత్రాలు!

ఆదర్శమనేది ఉన్నతమయినదిగా ఉండాలి. పక్షపాతము, స్వార్థమూ, అస్వాభావికత మొదలయిన అవలక్షణాలు గల ఆదర్శమేదీ నిజమయిన ఆదర్శమనిపించుకోదు. వెర్రితలలు వేసిన మన హిందూ సమాజం తరతరాలుగా ఆచరణలో పెడుతున్న దిలాంటి అష్టావక్రపు ఆదర్శాలనే. ఇతరులు తమయెడ ఎలా ప్రవర్తించాలనుకుంటారో, తాము కూడా అలాగే ఇతరులయెడ ప్రవర్తించాలనే సాధారణ నీతిసూత్రాన్ని విస్మరించడం జరిగింది. స్త్రీకో నీతిసూత్రం, పురుషునికో నీతిసూత్రం! దురాచారిగాని, దుష్టుడుగానీ, స్త్రీకి భర్త దైవసమానుడు. ఆమె కతడితోడిదే లోకం. అభమూ, శుభమూ తెలియని కన్య కానీయండి, ముక్కుపచ్చలారని పసికందు కానీయండి భర్త చనిపోతే జీవిత పర్యంతమూ అలా బ్రతకాల్సిందే. స్త్రీ పతివ్రత కావాలి. పురుషునికి మాత్రం పత్నీవ్రతం లాంటి బాదరబందీ యేమీ లేదు. స్వేచ్ఛగా ఇష్టమొచ్చినన్ని పెళ్ళిళ్ళు చేసుకోవచ్చు శత వృద్ధుకూడా. ధర్మంపేరిట, సభ్యతపేరిట ఇల్లాంటి కుత్సితమయిన నీతిసూత్రాలను అమలుజరిపి, మానవధర్మానికి హాని తలపెట్టారు. సమాజాన్ని వెనక్కు మళ్ళించి, ఆత్మఘాత ప్రయత్నాలకు పూనుకున్నారు.

ఈ తలాతోకా లేని ఆదర్శాలను కాపాడటానికి చేసిన రాక్షస ప్రయత్నమే సహగమనము. చచ్చిన భర్తతో పాటు భార్యనికూడా తగలేస్తే ధర్మాన్ని వాలుకుపోదాలా నడపొచ్చనుకున్నారు. తలగొరిగించి, అలంకార రహితంచేస్తే మానవ సహజమైన ప్రవృత్తులు నశిస్తాయని, స్త్రీ సహజమైన ఆకర్షణలు దూరమవుతాయనీ ఆత్మవంచన చేసుకున్నారు.

ఆ రోజులన్నీ గడచిపోయాయి. మనమిప్పుడు యిరవయ్యో శతాబ్దంలో ఉన్నాము. మానవ జీవితంలో ఎన్నెన్నో మార్పులు వచ్చాయి. నవభారత నిర్మాణం కోసం, అభ్యుదయ సమాజంకోసం బహుముఖ ప్రయత్నాలు సాగుతున్నాయి.

అయినా సహగమన కాలంనాటి మన స్త్రీల అవశేషాలు మనని యింకా పట్టి వేధిస్తూనే వున్నాయి. అజ్ఞానమూ, అంధవిశ్వాసమూ, తాండవమాడుతున్నాయి ఎటుచూచినా. వీటిని కాలమార్పుకుండా మనం సాధించే ప్రగతి ఏమీ ఉండబోదు!

## అలంకారాలు

కాలిమట్టెలూ, కళ్ళకాటుక, నుదుటి కుంకుమ, చేతిగాజులు, తలలోని పూలు యివన్నీ స్త్రీకి సహజ అలంకారాలు. వివాహానికి పూర్వంకూడా స్త్రీలు వీటన్నిటినీ ధరిస్తారు. భర్త మరణానంతరం వివాహ సంస్కారానికి చిహ్నమయిన మాంగల్యాన్ని దాచిపెట్టి, గౌరవించుకుంటే ఇంకా దానికో అర్థముంటుంది. ఉద్దేశ్యపూర్వకంగా, అలంకార రహితను చేసి ఆకర్షణలకు దూరంగా ఉంచాలనే ప్రయత్నం ఇంకా అమలు జరపటం మన సమాజానికి సిగ్గుచేటు.

అసలు అలంకరణ అంటే ఆడంబరాలతో కూడినదీ, అస్వాభావికమయినదీ కాదు. అలంకరణలో సహజత్వమూ, హుందాతనమూ ఉండాలి. భర్త చనిపోయిన స్త్రీలు మామూలుగా తమ అలంకారములను తీసివేయనక్కరలేదనడంలో అర్థం షిఫాన్, రేయాన్, నైలాన్ సిల్కులతో జాకెట్టు వీపూ, మూరెడు పొట్టా బయట వేసుకుని పెదవులకూ, గోళ్ళకూ రంగుపట్టించి, నడివీధుల్లో ప్రదర్శన లివ్వమని కాదు నేను చెప్పేది. అసలలాంటి అసహజమయిన, అసహ్యమైన అలంకరణ వారికేకాదు ఎవరికైనా అనర్థకమే.

భర్తృవియోగంతో సహజంగానే అలంకారాల ఎడ విముఖత కలిగితే వారినెవరూ బలవంత పెట్టనక్కరలేదు. నాకు తెలిసిన అక్కగారొకరున్నారు. ఇరువది సంవత్సరాలనాడు పొరుగూరు బంధువుల వివాహానికని ఆమె తలనిండా పూలుతురిమి పట్టుచీర కట్టి, తొణికిసలాడే హృదయానందంతో వెనుకవస్తున్న భర్తకోసం ఎదురుచూస్తోంది. ఇంతలో గ్రామకక్షలతో, మరొక వ్యక్తనే భ్రమలో చీకటిమాటున తెలియక ఆమె భర్తను పొడిచి చంపారని కబురు వచ్చింది. అప్పటికామెకు ఇరువది సంవత్సరాలున్నవో లేవో. ఆమె ఇప్పటికీ అంచులేని ఓమురిక ఖద్దరు పంచా, జాకెట్టూ తప్ప మరేదీ ధరించదు. ఆమెది తన బట్టలుతానే ఉతుక్కునే అలవాటు. వాటిని సాధ్యమయినంతవరకు, శుభ్రపరుస్తుందేకాని, తెల్లపడనివ్వదు. కావలసినంత ఆర్థికస్తోమతుంది ఆమెకు.

ఆత్మనిగ్రహానికి జీవితంలో చాలా ప్రాముఖ్యతుంది. అనేకమంది యౌవనంలో ఉన్న యువతులు పునర్వివాహం చేసుకునేందుకు వీలులేని పరిస్థితులున్నాయి. ఒకరిద్దరు పిల్లలు కలిగినాక భర్త చనిపోవటం తటస్థిస్తే, ఆమె మళ్ళీ వివాహం చేసుకునేకన్నా ఆత్మనిగ్రహంతో కాలక్షేపం చేయటమే మెరుగవుతుంది. ఎందుకంటే ఒకవేళ ఈమె మళ్ళీ వివాహం చేసుకోవాలనుకుంటే కాబోయే భర్తకూడా పునర్వివాహము చేసుకునే వ్యక్తే కావచ్చు. అతనికి కూడా బిడ్డలుండవచ్చు. ఈ బాధ్యతలన్నిటినీ వహించటంలో ఎంతో విశాల హృదయులైతే తప్ప సౌఖ్యముండదు. ఒక పాశ్చాత్య మహిళకే అలాంటి రెండవ వివాహము సుఖప్రదమనిపించ లేదంటే, భారతీయ మహిళ కెలా సుఖప్రదమౌతుంది? కాబట్టి ఇలాంటి సందర్భాలలో స్త్రీలు విజ్ఞతతో, హుందాగా సమాజానికి బాధ లేకుండా జీవితగమనం సాగించడం మంచిది. ఇలాంటి పరిస్థితుల్లో కేవలం ఆర్థిక ఇబ్బందులతో స్వతంత్రంగా బ్రతికే శక్తి లేక వివాహము చేసుకొనే స్త్రీలను అనేకమందిని చూస్తున్నాము. అలా కాకపోతే మరింత ప్రమాదకరమయిన మార్గాలను చేపట్టేందుకు దారి తీస్తుంది వీరి ఆర్థిక దుస్థితి.

పాతకాలపు మన స్తత్వాలను విడనాడి కేశఖండన మొదలయిన పిచ్చి పనులకూ, మూఢ నమ్మకాలకూ స్వస్తి చెప్పాలి. పుణ్య స్త్రీలు, విధవలు అనే భేదంలేకుండా, అందరినీ సమానమైన గౌరవభావంతో చూడటం అలవర్చుకోవాలి. భర్తలు పోయిన స్త్రీలు చేతిపనులు కాని, మరే ఇతర ఉద్యోగాలు కాని చూచుకుని, ఇతరులకు భారం

(49-వ పేజీచూడండి)

# బంగారపు ఇటుకలు





బండి ఆగి ఆగడంతోటే శంకరం అవలీలగా క్రిందకి దూకి, "అమ్మా, పండుగుల కింటికి వచ్చేశామే!" అంటూ రాజమ్మగారి వొళ్లో వాలిపోయాడు. పట్నం బళ్లో తను ఫోర్త్ క్లాసులో జేరేక సంపాదించిన బహుమతు లావిడ చేతులోపెట్టి, గుక్క తిరక్కుండా గొప్పలు చెప్పేస్తున్నాడు.

కొడుకు మాటలు వింటుంటే రాజమ్మగారి కెంతో గర్వంగా అనిపించింది. ఆశ్చర్యంగా కూడాను. ఆర్నెల్ల క్రితం పీలగా ఉండే వాడింత ఉత్సాహం ఉట్టిపడేటట్లు తయారవడం ఆశ్చర్యం కాదూ, మరి?

అంతట్లో రాజమ్మగారి పెద్ద కొడుకు రామం, అతని భార్య, లక్ష్మి, బండి దిగి, సామానింట్లో పెట్టిస్తున్నారు. "పట్నంనుంచి బంగారపిటుకలు పట్టించుకొచ్చే రేంటం డబ్బాయిగారు, పెట్టెలింత బరువుగా ఉన్నాయి?" అన్నాడు బండివాడు.

"బంగార పిటుకల కేంలోటు, నాయనా?" అంది రాజమ్మ

DL. 326A-X62 TL'

గారు. "కొత్త పెళ్లాం పెత్తనమూ, పట్నవాసం పోదు పూను. అంతా మిగులే!"

రాజమ్మగారి వెటకారమంతా కోడలి కోసమే. నిక్షేపం లాంటి మేనరికాన్ని చెడగొట్టి రామాన్ని వల్లోవేసు కుందని లక్ష్మిమీద రాజమ్మగారికి కోపం. అందుకే రామం కొత్త కాపురంతో ఉండక ఆవిడ పల్లెటూళ్లోని తన స్వంత ఇంట్లోనే వుంటోంది, కూతురు సీతని ఆసరాగా ఉంచుకుని.

తల్లీ పిల్లలూ కబుర్లు చెప్పకుంటూండగా ఆడుకుందుకు వెళ్లిన సీత వచ్చింది. యకాయకి వదిన దగ్గరకు వెళ్లి, వేళాకోళాలు చెయ్యడం మొదలుపెట్టింది. పట్నంలో వదినతో జట్టుగావున్న శంకరంకూడా సీత పక్షమయి పోయాడు.

ఆనాడంతా రాజమ్మగారు లక్ష్మిపట్ల ముభావంగానే ఉంది. పండుగనాడు పిల్లలకి తలంటి క్రొత్త బట్టలు కట్టింది. కోడలి ప్రమేయం లేకుండానే వంట ప్రయత్నం మొదలు పెట్టింది. కాని సీత పండుగనాడు వదిన వంటకాలు రుచి చూడాలని పట్టట్టింది. భార్య పాకనైపుణ్యం తల్లికి చూపాలని కుతూహలపడుతూన్న రామం సీత కోరికను బలపరిచేడు.

వదిన వంటపనులు చేస్తూంటే రాజమ్మగారు పిల్లలతో కబుర్ల కాలక్షేపం పెట్టుకుంది. రామం వీధి గదిలో చదువుకుంటూ కూర్చున్నాడు. ఇంతలోనే రాజమ్మగారి కోవిషయం జ్ఞాపకం వచ్చింది. "చూడు, సీతా! త్వరగా వెళ్లి వదినతో ఆ సీసాలో నూనె పొంగొచ్చే రకం అవి చెప్పిరా. లేకపోతే, ఇల్లంటించగలదు," అంది.

సీత వెళ్లి అలమారులో చింతపండు కోసం వెతుకు

తూంటే ఆమె దృష్టి నూనె పసాపుద పడింది. నవ్వుతూ. వదినతో అంది: "నూనె మరిచిపోయి పిండివంటెలాగ చేద్దామనుకున్నావమ్మా? ఇంత మందమతయితే మొగుడు పేరు కూడా మరిచిపోగలవు..."

కాని. తీరా చూస్తే వదిన పిండివంట చెయ్యడమయిపోయింది. గారెలూ, బజ్జీలూ, రెండు పళ్లేలలో నోరూరేటట్లు పేర్చి ఉన్నాయి. సీత చటుక్కున ఒక బజ్జీ నోట్లో వేసుకొంది. ఓః బాగుంది. "దేంతో చేసేవమ్మా?" అని అడిగింది. కాని వదిన. "చెప్పుకో. చూద్దాం! చెప్పుకుంటే చక్కటి మొగుణ్ణి తెచ్చి పెళ్లిచేస్తా" అంది.

సిగ్గుపడి సీత తల్లి దగ్గరకు వెళ్లి: "నూనె వాడకుండానే వదిన పిండివంట చేసేసిందే. దేంతో చేసిందో చెప్పమంటే చెప్పడం లేదు." అని ఫిర్యాదు చేసింది.

"చెప్పడాని కేముంది?" అంది రాజమ్మగారు చిరచిరలాడుతూ. "ఆ నెయ్యంతా వాడేసి ఇల్లు గుల్లచేసిందేమో!" అంటూ వంటింట్లోకి వచ్చింది. అత్తగారి ప్రశ్నకెంతో వినయంగా సమాధానం చెప్పింది లక్ష్మి. "నెయ్యి వాడలేదత్తగారూ. వంటలకి ప్రశస్తమయిన డాల్డా వనస్పతిని వాడేను."

"అదేమిటో నాకు తెలియదమ్మా! మీ పట్నవాసపు వంటలతో మా ఇంట్లోకి రోగాలూ, రొచ్చులూ మాత్రం తేకు. నీకు పుణ్యముంటుంది."

"పరిశుభ్రమయిన నూనెలతో చేసిన 'డాల్డా' సీలువేసిన డబ్బాలలో అమ్ముతారండి. అందుచేత దాంట్లో రోగాలు తెచ్చే మురికీ. కల్తీలూ కలవడాని కవకాశం లేదు. పైగా 'డాల్డా' శరీరానికి రోగాలనుంచి కాపాడుకునే శక్తినిస్తుంది. ఆ విషయం మీ అబ్బాయిల ఆరోగ్యాన్ని చూస్తే మీకే తెలుస్తుంది."

అయితే. అదన్నమాట. శంకరం క్రొత్త ఉత్సాహ శక్తుల కిటుకు కోపం తగ్గించుకున్న రాజమ్మగారు గొంతు మార్చి అడిగింది: "మరి. పిల్లా. నూనెలతో చేస్తే 'డాల్డా'లో ఉన్నవిశేష మేమిటే?"

"ఉత్త నూనెలే కాదండి." అంది లక్ష్మి. 'డాల్డా' చేసేటప్పుడు శరీరాని కవసరమయిన విటమినులనే పదార్థాలన్నీ కలుపుతారు. ఎత్తుకెత్తు నేతిలో ఉన్నంత విటమిను 'ఎ' అనే పదార్థాన్ని కలుపుతారు. ఇది శరీరానికి రోగాన్ని విరోధించే శక్తినిస్తుంది. పైగా విటమిను 'డి' అనే పదార్థాన్ని కూడా కలుపుతారు. ఇది ఎముకలూ, పళ్లూ దృఢంగా ఉండేటట్లు చేస్తుంది. అదీ విశేషం." ఉండబట్టలేక రాజమ్మగారొక గారెముక్క విరిచి నోట్లో వేసుకుంది. "బాగుంది. కాని 'డాల్డా' అన్ని వంటలకీ పనికొస్తుందా?"

"నిక్షేపంలాగ." అంది లక్ష్మి. 'డాల్డా'తో కూరలూ, వేపకాలూ చేసుకోవచ్చు. అట్లూ. అరిసెలూ చేసుకోవచ్చు. చారులో పోపు మొదలుకొని జిలేబీ చేసుకోవడం వరకూ అన్నింటికి 'డాల్డా' వాడుకొనవచ్చు."

"ఆహా!" అంది రాజమ్మగా రాశ్చర్యముగా. "అయితే ఇంత మంచి సరుకు బోలెడు ప్రియ మనుకుంటాను."

అత్తాకోడళ్లు కలహపడుతున్నా రనుకుని వంటింట్లోకి వచ్చిన రామం దానికి జవాబు చెప్పేడు. "కాదమ్మా. 'డాల్డా' వాడకంతో నేతి వాడకంకంటె ఎక్కువ ఆదా చేయవచ్చు. కాని అది కాదు ముఖ్య విషయం. 'డాల్డా' యొక్క ప్రశస్తమయిన గుణాలవల్లనే ఏటా ఇంచుమించు రెండు కోట్ల డబ్బాలు అమ్ముడవుతాయి."

"వచ్చేటప్పుడు డాల్డా డబ్బాలు పట్టుకొచ్చేవా, వదినా?" అని అడిగేడు. శంకరం.

"నువ్వు సీత పక్షం కదూ? నీకూ నాకూ కావ్‌కావ్! నేను చెప్పను, వెళ్లు! అంది లక్ష్మి. కాని రాజమ్మగారితో ఆ విషయం చెప్పుకుంది.

"శంకరం వయస్సులో 'డాల్డా'లో లభించే పోషక పదార్థాలు అతని ఆరోగ్యానికెంతో అవసరం. చూడండి. కనుక సెలవుల్లో వాడకానికి రెండు డబ్బాలు పట్టుకొచ్చేను."

"అయితే, అదన్నమాట బండివాడు బంగారపు ఇటుకలనుకున్న బరువు!" అన్నాడు రామం నవ్వుతూ.

ఖర్జూరపు చెట్టు బొమ్మ వేసివున్న పసుపుపచ్చటి 'డాల్డా' డబ్బాని పట్టుకొని రాజమ్మగారంది: "నిజంగా బంగారంలాంటి సరుకే!"

శంకరం ఆరోగ్య విషయమై లక్ష్మికున్న శ్రద్ధకి రాజమ్మగారు మురిసిపోయింది. పైగా కోడలి వినయమూ. పొదుపూ. పనిలోని చురుకుదనమూ ఆవిడకెంతో నచ్చేయి. ఇంత మంచి పిల్ల నిన్నాళ్లూ అదొక రకంగా చూసినందు కెంతో నొచ్చుకుంది.

లక్ష్మి దగ్గరకి వెళ్లి వీపు తట్టుతూ అంది: "శంకరం ఎవరిపక్షమైతే నీకేంలే, అమ్మాయ్! ఇప్పట్నుంచి నీ పక్షాన్ని నేనుంటానుగా!"

రాజమ్మగారి వైఖరిలో మార్పుకి రామం, లక్ష్మి చెప్ప లేనంత సంతోషించేరు. అయితే సెలవు లాఖరున సీతను తీసుకుని రాజమ్మగారు తమతోబాటు పట్నంవచ్చి ఒక్క కాపురంగా వుండడానికి వప్పుకున్నట్లేనా?

"నిస్సందేహంగా!" అంది రాజమ్మగారు.

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్, బొంబాయి

DL. 326B-62XTL

# వనితా వాణి



"హీరా" గారు వ్రాసిన శీర్షిక "మగువలు మగవారు" అన్నది చదివాను. చదివిన తర్వాత "గాస్కోలాల్చీవాలా" దిఫూరిగా తప్పని ఋజువవుతున్న "హీరా" గారిది కూడ కొంత తప్పుగా కనిపిస్తోంది. ఏదో ఒక సంఘటనను చూపుతూ చదువుకున్న యువతుల నందర్నీ ఒకే వరసకి తీసుకురావటం రచయిత్రికి తగదు. యువతులందరు "గ్లాస్కో లాల్చీవాలా" లాగుంటే యువతులు బయటికే రాలేకపోదురు.

—ఎస్. వి. రాఘవరావు, బొంబాయి]

* * *

"మగువలు - మగవారు" అనే వ్యాసం చాల బాగుంది. హీరాగారన్నట్టు యీ రోజుల్లో ఒంటరి పాటునవున్న ఆడవారిని (వారికి పెళ్ళయిందా లేదా అన్నది వేరే ప్రశ్న) గోలచెయ్యడం మగవారికి అదో అలవాటయి పొయ్యింది ... సినిమా హాల్లో కానివ్వండి, కాలేజీల్లో కానివ్వండి, బస్సుల్లో కానివ్వండి, ఆడవారికి అవమానం తప్పడంలేదు. ఇది యావదాంధ్ర వనితా లోకం విచారించవలసిన విషయం. హీరా గారు తన 'విలను'కి సరయిన గుణపాఠం నేర్పారు. ఆవిడ సమయస్ఫూర్తిని విశాలతనీ నేనెంతో మెచ్చుకుంటాను. హీరా గారికి నా అభినందనలు.

—దాక్షాయిణి, కదిరి, అనంతపురంజిలా]

* * *

పి. అనసూయగారు వ్రాసిన "నవ్వు" అనే వ్యాసం చదివాను. చాల బాగున్నది. బాగుగ వర్ణించారు. ప్రత్యేకంగా "నవ్వు బాలగంధాల చేటు" అని, "వెక్కిరింపు నవ్వు" అని మంచి ఉదాహరణములతో వ్రాసినారు. "బొలాయి దగ్గర గలాట"అను వ్యాసమును టి. యస్. కమలా కుమారిగారు బాగుగా వ్రాసినారు. ఈ రచయిత్రులకు అభినందనలు.

—పరిమి మధుమతి, నెల్లూరు]

## నాకు తెలుసు

కాలునొప్పికి చికిత్స, "మీకు తెలుసా?" అని ఏప్రిల్ 23 వ తేదీ వార పత్రికలో నా సోదరికి నాకు తోచిన చిన్న చికిత్స వ్రాస్తున్నాను. నెలకు 4, 5 పర్యాయములు ఈ విధముగా చేసిన ఒంటికాలు, నెప్పి, రెండు కాళ్ళూ నెప్పులుకూడా తగుతాయి. సాయంత్రము కాళ్ళకు బాగా ఆముదము వ్రాసి మర్దనచేసి ఆముదము ఇంకిపోయేటట్లు రుద్దవలెను. అరికాలులోనుకూడా ఆముదము వ్రాయవలెను నడినెత్తినికూడా బాగా ఆముదము అంటిన కాళ్ళతీత వేడినైనా మరొదాని వలననైన తగుతుంది ఈ ప్రకారము తరుచు చేస్తూవుంటే తగ్గుతాయి.

## ఎండ తాకిడికి

వేసవిలో వడదెబ్బ తగలకుండా ఉండడానికి నిమ్మకాయ రసము మజ్జిగలోనో, నీళ్ళల్లోనో నిమ్మరసము, పంచదార వేసి బాగా కలిపి నిత్యము తీసుకొన్న ఈ మండు కాలములలోను అనగా వైశాఖ, జ్యేష్ఠమాసములలో ఎండదెబ్బ తగలదు. దాహము కానీయదు.

సాధారణముగా వైశాఖ జ్యేష్ఠమాసలలో వళ్ళుపేలి, దురద గలుగుతుంది. పేలడము తగాలంటే లేతముంజెలు నిత్యము తినాలి. ముంజెలలోవుండే నీళ్లు వంటినిండా ముఖ్యముగా పేలినచోట వ్రాసిన పేలడము తగుతుంది. మరో చికిత్స ఏమిటంటే సానమీద మంచి గంధముతీసి గంధము వంటికి వ్రాసిన పేలడము తగ్గుతుంది.

ఇవటూరి శ్యామలాదేవి (తెనాలి).

* * *

## నాకు తెలిసినది

ఒంటి కాలినొప్పికి నాకు తెలిసిన రెండు వైద్యాలు చెప్తున్నాను. ఈ రెండిటిలో ఏ వైద్యం చేసినా ఈనొప్పి తగ్గిపోతుంది.

1 మెంతులుగాని, ఆవాలుగాని చూర్ణము చేసి, దానికి తగుమాత్రము నీటిని చేర్చి కాలి మడమలకు పట్టువేసినచో వారం రోజులలో బాధ తగిపోతుంది.

జిల్లేడుపువ్వులు నూరి వారం రోజులు కాలి మడమలకు కటినచో నొప్పి తగును.

16-4-58 ఆంధ్ర పత్రికలో పి. భానుమతిగారు వ్రాసిన 'కోరికలు, కొరతలు' వ్యాసం చాలాబాగున్నది. 23-4-58 పత్రికలో 'ఒక అబాధ ఆత్మఘోష' దామర్ల చిన్నమ్మగారి విషయం చదువుతుంటే నాకు తెలియకుండానే కళ్ళవెంట నీళ్ళు కారినాయి. ఈ రోజుల్లో కూడ స్త్రీలు ఇంతటి దుర్భరమైన జీవితం గడుపుతున్నారంటే చాల విచారంగా నున్నది.

—కాజ వెంకటకమల, విజయవాడ]

* * *

## ఇదిమాత్రం బాగుందా!

16 4. 58 ఆంధ్రవార పత్రికలో శ్రీమతి వారణాసి సుబ్బలక్ష్మిగారు వ్రాసిన 'రోజులు మారాయి' చదివాను. అందులో ఆవిడ వాళ్ళ పక్కింటి వారిమీద అంతఘాటుగా ఎందుకు వ్రాశారో అని చాలా ఆశ్చర్యం వేసింది. మనల్ని ఎవరైనా, నీపేరేమిటి వూరేమిటి. చీర ఎంతకొన్నారు అని అడుగుతే వాళ్ళని చాలా తేలిగా చూస్తాము కదా. పక్కింటి ఆవిడ్ని మనం మీ చీరెంత, చెప్పులెంత, లేసుపరికిణీలు ఎందుకు? అని అడగడం బాగుందా? ఇంతకూ, ఆపక్కింటావిడ వేషంలో అంత ఆశ్చర్య పడ్డానికి ఏముందక్కే ఆవిడ పల్చటి చీరలక్రింద పరికిణీలు వేసుకుంటే తప్పా? అది పత్రికల్లోకి ఎక్కించి ఆవిడ్ని అవమానం చెయ్యటం ఎందుకు?

—లలితాదేవి, విశాఖపట్నం]

## సక్తు మంథం

సక్తుమంథం - తినడానికి రుచిగా వుంటుంది. తేలిగ్గానూ వుంటుంది. ఆరోగ్యానికి మంచిదికూడాను.

వడ్లు వేయించిన, పేలాలు తయారవుతాయి. వాటిని, ధాన్యంపొట్టు ఆవిలేకుండా బాగుచేసి, చేతితో నలిచినట్లయిన మెత్తని పొడియగును. ఆ పొడిలో నేయి కావల్సినంత వేసి పిసికి - ఎక్కువ పల్చగానూ, ముద్దగానూ గాకుండా వుండుటకు అవసరమయినంత చన్నీరుచేర్చి మరలా చేతితో పిసకవలెను. అందు అవసర పడునంత బెల్లము గానీ, పంచదారగానీ చేర్చుకొనవచ్చును. దీనికే "సకుమంథ"మని పేరు. ఇది పుష్టిని బలాన్ని యిస్తుంది. దప్పికను పోగొట్టుంది. శ్రమలేకుండా చేస్తుంది.

—వైద్యశ్రీ ప్రకాశచంద్ర శతపథి,
విజయవాడ.



# రాళ్లలోని రత్నం



(31-వ పేజీ తరువాయి)

లు తెలుసుకోవటమే కాక తను కూడా తెలుసుకోగలిగాడు. అతని ప్రవర్తనలో, స్వభావములో కూడా చాల మార్పులు వచ్చినవి. ఎప్పుడైనా వుత్సవాల్లోగాని, వివాహ సందర్భాల్లోగాని యితని పాటకచేరీ యేర్పరిస్తే యితను వెళ్ళి తన గాననైపుణ్యాన్ని ప్రదర్శించి ఆశ్రోతల ప్రశంసల నందుకునేవాడు.

అనతికాలంలోనే రేడియో కేంద్రం వారు మాధవరావును ఆహ్వానించి తమ శాస్త్రీయ సంగీత కార్యక్రమాల్లో అవకాశము కలుగజేసారు. స్థానికంగా తను గడించిన సత్కీర్తిని యీ అవకాశముతో నలుగడల వ్యాపింపజేసుకున్నాడు. అతని కీర్తి ప్రతిష్ఠలతో పాటు అతని ఆదాయంకూడా బాగా వృద్ధి అయింది. వెనుకటి చిన్నగది వదిలి యిప్పుడొక చక్కని ఇంట్లో నివాస మేర్పరచుకొన్నాడు. తన వుపాధ్యాయ వృత్తినివదలి గానకళకే తన జీవితం అంకితం చేశాడు. ఆ నగరంలో యిప్పుడెక్కడ గొప్ప కార్యక్రమాలు జరిగినా మాధవరావు పాటకచేరీ యేర్పాటు చేయటం ఒక పరిపాటి అయింది. ఇతనికోసం నగర ప్రముఖులు, గానకళాభిమానులు, శ్రీమంతులు తమ కార్లలో యితని ఇంటికే వచ్చి తీసుకొనివెళ్ళి ఆదరిస్తూ వున్నారు. నిన్న మొన్నటివరకు జడుడు, బుద్ధావతారమని హేళనచేసి నిరాదరించినవారే యితనిని యీ రోజున మహాపండితుడు, ప్రముఖుడని ప్రశంసించసాగారు. అతని జీవితంలో అచిరకాలంలోనే కలిగిన యీ మార్పు అందరిని ఆశ్చర్యచకితులను చేసింది.

'ధనమూలం యిదం జగత్' అనే సామెత మాధవరావు జీవితంలో తన యథార్థతను ఋజువుచేసుకుంది. ఎంత వుత్తముడైనా అతను నిర్ధనుడైతే సంఘమతనిని నిర్లక్ష్యం చేసి, అవహేళన చేసేందుకు వెనుకాడదు. కాని అతనే కొంత ధనమార్జించి, కీర్తిగాంచితే అతనికి బ్రహ్మరథం పట్టి పూజిస్తుంది. అతనిని ఆదరించి ఆరాధిస్తుంది. సువర్ణానికి సౌరభమబ్బినట్లు మాధవరావు సహజ సౌశీల్యానికి యీ కీర్తి ప్రతిష్ఠలు దోహదాలై అతని జీవితమార్గాన్ని సుగమ మొనర్చాయి. ఇతని స్నేహమాశించి ఆ పేటలోని పెద్దలు కొందరు అతనిని తమ అల్లుడుగా చేసుకోవాలని తాపత్రయ పడసాగారు. అతనిని అవమానించి హేళనచేసిన యువతులు కొందరు పశ్చాత్తాప పడి యిప్పుడతని సాహచర్యము వాంఛింప జొచ్చారు. ఇంకా కొందరు శ్రీమంతులు యీ ప్రసిద్ధగాయకునికి గొప్ప కట్నాలిచ్చి తమ కన్యలనిస్తామని వచ్చారు. కాని మాధవరావు ఎవరికి ఎలాంటి సమాధానమియ్యకుండా మౌనం వహించాడు.

ఈ సంగతి సందర్భాలన్నీ శాస్త్రిగారికి పార్వతికి తెలుస్తూనే వున్నయి. మాధవరావు పరిస్థితి, సంపద యిప్పుడు తమ అంతస్తుకు యెన్నో రెట్లు పెరిగిపోయింది. అతని వుచ్ఛదశను, అతని వేషభాషలలో కలిగిన మార్పులను చూచి వారు చాల ఆనందిస్తున్నారు. మాధవరావుకు యిప్పుడు వెనుకటి వలె తీరిక వుండటములేదు. ఎప్పుడూ యేదో ఒక కార్యక్రమంలో పాల్గొనవలసి వుంటేది. అయినా అప్పుడప్పుడు వచ్చి వీరిని చూసి పోతూ వుండేవాడు.

పార్వతి వివాహ సమస్యను గురించి శాస్త్రిగారు ఒకమారు ఆమెతో తన మనస్సులోని అభిప్రాయం వ్యక్తపరచాడు. కాని పార్వతి మాత్రం కొంత సంకోచంతో "నాన్నగారూ-మీ అభిప్రాయానికి నాకేమీ అభ్యంతరంలేదు. కాని యిప్పుడు మాధవరావుగారున్న స్థితిలో మనం వారితో సరితూగగలమా? అయినా వారి అభిప్రాయం యెలావుంటుందో? ఇప్పుడు యెంతో మంది శ్రీమంతులు యెంతైనా కట్నకానుకలిచ్చి పిల్లనిచ్చేందుకు ముందుకువస్తుంటే అటువంటి అవకాశాలన్నీ వదులుకొని మనతోనే కట్టుబడి వుండమని వారిని కోరటం భావ్యంకాదు. మనము వారికి సహాయంచేశామనే కారణంగా యీ విధంగాకోరి వారిని ఒకరకమైన యిరకాటంలో పెట్టి వారి పురోభివృద్ధి మార్గాన్ని అరికట్టటం నాకు యిష్టంలేదు" అని తన ఉద్దేశం తెలియజేసింది.

పార్వతి ఆ వుద్దేశముతోనే మాధవరావుతో వెనుకటిలాగా చనువుగా వుండటం తగ్గించింది. మాధవరావు తమ యింటికి వచ్చినప్పుడుకూడా సాధ్యమైనంతవరకు దూరంగా తప్పుకొనిపోవటం మొదలుపెట్టింది. ఇది అతను కొంత గమనించి ఆమె గృహనిర్వహణభారంతో వుండటంవల్ల అలా వుంటున్నదని భావించాడు.

మాధవరావు ఒక పర్యాయం శాస్త్రిగారింటికి వెళ్లాడు. శాస్త్రిగారు అప్పుడే పనిమీద బయటకు వెళ్ళారు. పార్వతి గదిలో కూర్చొని చదువుకుంటోంది. అతన్ని చూడగానే ఆమె లేచి "నాన్నగారు యిప్పుడే బయటకు వెళ్లారు. కూచోండి. ఇంకో అరగంటలో వస్తారని" చెప్పి తానొకమూల దూరంగా నిలబడ్డది. ఇటువంటి పరిస్థితిలో ఆమెను కలుసుకొంటానని అతను అనుకోలేదు. ఆమె కొంచెం బిడియం, భయంతో వుండటం చూసి అతను నవ్వుకున్నాడు. తను వంటరిగా వుండగా తనగదికివచ్చి తనను పలుకరించి అతని భయాన్ని సిగ్గును వదలగొట్టిన పార్వతి లేనా యీమె అనుకొని "ఏమిటి పార్వతీ నన్ను చూసి నీవెందుకు అంత భయపడుతున్నావు? నేను లోకానికి క్రొత్తవాడనైనా నీకుమాత్రం పాతవాణ్ణేగా? అసలు నేను యీ రోజున యింత ఉన్నతస్థితిలో వున్నానంటే దానికంతకు ముఖ్యకారణం నీవేగదా!! ఇక్కడ ఆదరణలేక నిస్సార జీవితం గడుపుతున్న నన్ను ఆదరించి నాలో అణగివున్న విద్యను గుర్తించి ప్రోత్సహించి నా కీర్తిప్రతిష్ఠలకు ఐశ్వర్యానికి పునాది నీవే వేశావు. నీకు నాయందు వెనుకటి ప్రేమాభిమానాలు, సానుభూతి వున్నాయా? లేకపోతే నీవు నన్ను ధనమదాంధతతో మిమ్మల్ని మరచిపోయేంత నీచునిగా భావిస్తున్నావా? ఈ సంగతి నేను సరిగా తెలుసుకోలేకపోతున్నాను" అని ఆవేశపూరితంగా అన్నాడు.

పార్వతికి యిదంతా స్వప్నావస్థలో జరిగిన సంఘటనలాగా తోచింది. సంతోష సంభ్రమాలతో ఆమె చలించిపోయింది. వికసితరాలైవున్న ఆమె ముఖంలోని ఆనందరేఖలుచూసి మాధవరావు వుత్సాహంతో "పార్వతీ నీకు నాయందు ఎప్పుడూ సదభిప్రాయం వుంటుందని నాకు తెలుసు. నీవు నానుండి దూరంకావటం నేను సహించలేను. నీవు నా జీవితానికి ఒక చక్కనిబాట నేర్పరచావు. ఒంటరిగా ఆ మార్గంలోపోయే శక్తిసామర్థ్యాలు నాకులేవు. నీ సహకారము, సాహచర్యము లేనిదే నా జీవితాన్ని సుఖప్రదము చేసుకోగలననే ధైర్యముకూడా నాకులేదు. నా హృదయాన్ని యెప్పుడో నీకు అంకితము చేశాను. ఇంక అక్కడ యెవ్వరికీ తావులేదు. రాయినైనానకే రత్నంగా మార్చగలిగిన ప్రేమమూర్తివి నీవు. నీకు సమ్మతమైతే మన యిద్దరి జీవితాలను యేకంచేయమని నేను మీ తండ్రిగారిని ప్రార్థిస్తాను" అన్నాడు.

మాధవరావు నోటివెంటవచ్చిన ఈ మాటలు విని పార్వతి ఆనందపరవశురాలైంది. వికసితవదనంతో "మాష్టరుగారూ — మీకు యేమి సమాధానంచెప్పాలో నాకు తోచటంలేదు. మీ సాహచర్యంకంటే నేను కోరేదేమీలేదు. నిజానికి నేను రాయిని రత్నంగా మార్చలేదు. కాని రాళ్లలో మరుగుపడిపోయిన రత్నాన్ని వెదికి బయటకు తీశాను. ఈ రత్నం యెప్పుడూ యింత కాంతివంతంగానే రాణించాలనే నేను కోరుకుంటాను" అని మాధవరావు పాదాలకు నమస్కరించింది.

"నీవు చెప్పింది కొంతవరకే నిజం పార్వతీ! రాయిని రత్నమని రత్నమే కనిపెట్టింది, అని మాధవరావు సంతోషంతో నవ్వాడు.

అతని నవ్వుతో పార్వతి తన నవ్వును కూడా కలిపింది. ఆ హృదయపూర్వకహాసం వారిద్దరిహృదయాలను ఏకంచేసింది. ★




##  త్రాగినవాడి మాట 

అంకయ్య అనువాడు
    అమలాపురంబున
త్రాగుబోతులలోన
    పేరొందియుండె.
కడివెడు కల్లయిన
    కడుపునిండా త్రాగి
లెక్క చేయడు తనకు
    లెక్క లేనట్లు.
ఒకనాడు ఊరివెలు
    పల చెరువు కడకేగి
విశ్రమించెను అచట
    కడుపార త్రాగి
చల్లగాలికి అతడు
    సుఖముగా నిద్రించి
ఆవులించుచు లేచి
    యిట్లనగ దొడగ:
"ఈశ్వరా! యీ చెరువు
    సారాయి యైనచో,
మధ్యనుండిన కొండ
    గుండకాయైనచో
నిలుచున్న పాటునే
    నిలువుదోపిడి నిత్తు"
అనుచు ప్రార్థించంగ
    ఆదిదేవుడువచ్చి
చెరువునంతయు నింపె
    సారాయితోడ;
మధ్యనుండిన కొండ
    గుండకాయైపోయె.
త్రాగాడు అంకయ్య
    తనివిదీరేటట్లు,
తిన్నాడు మాంసాన్ని
    తినగలిగినంత.
తనివారతిని, త్రాగి
    తూలుతూ, సోలుతూ
తనయింటివైపతడు
    పయనమైనాడు.
ఈశ్వరు డేతెంచి
    దారి కడ్డమువచ్చి
నిలువుదోపిడి నడుగ
    నిట్లులన్నాడు:
"తాగుబోతులమాట
    తక్కెడో, బిక్కెడో,
నామాట నీవెట్లు
    నమ్మకొన్నావయ్యా!"
అనుచు వచ్చిన త్రోవ
    తానేగ తూలుతూ;
సిగ్గుపడి ఈశ్వరుడు
    భగ్గుమన్నాడు. ★

# అంతా వైద్యులే

అక్బరు పరిపాలించే రోజుల్లో బీర్బల్ గురించి తెలియనివారు లేరు. అతడంటే అక్బరు కెంతో యిష్టం. బీర్బల్ చెప్పే మాటలు వింటూ అక్బరు సభలోని వారందరూ ఆనందించేవారు. బీర్బల్ లేనిదే అక్బరుకు ఒక్క నిముషమైనా తోచేదికాదు.

ఒకనాడు అక్బరు సభ తీర్చి కూర్చున్నాడు. బీర్బల్ కూడా ప్రక్కనే వున్న ఒక ఆసనం మీద కూర్చుని యున్నాడు. అక్బరు సభాసదులవంక జూచి "ప్రపంచములో ఎక్కువమంది యొక్క వృత్తి ఏమిటి"? అని అడిగాడు. ఆ ప్రశ్నకు సమాధానం దొరకక అందరూ ఒకరి మొహాలొకరు చూచుకున్నారు. అప్పుడు అక్బరు పాదుషా బీర్బల్ వంక చూచాడు. బీర్బల్ వెంటనే నిలబడి "చిత్తం. ప్రపంచంలో ఎక్కువమంది యొక్క వృత్తి వైద్యమే," అని వినయంగా సమాధానం చెప్పాడు.

"నీ సమాధానం నాకు సబబుగా కన్పించడంలేదు. మన రాజ్యంలో వైద్యుల సంఖ్య తక్కువ గాబట్టే నేను వారికోసం ప్రకటనలు కూడా చేస్తున్నాను" అని అసంతృప్తిగా అన్నాడు అక్బరు. పాపం! బీర్బల్ మొహాం చిన్నబోయింది. "ఇంతకన్న మంచి సమాధానం లేదే! ఇదే మంచి జవాబు అని ప్రభువు వారికి నచ్చచెప్తాను" అని లోపల అనుకుని ఆ రోజుకు సెలవు తీసుకున్నాడు బీర్బల్. ఆ రోజల్లా బీర్బల్ ఆలోచించే సరికి తట్టింది ఒక ఉపాయం.

మరునాడు బీర్బల్ తలకు ఒక గుడ్డ బిగించికట్టి సభకు బయలుదేరాడు. రాజ ప్రాకారం దాటి లోపలికి పోతుంటే దారిలో అతని మిత్రుడు ఎదురుపడ్డాడు. బీర్బల్ తలకు బిగించిన గుడ్డవంక జూస్తూ "అదేమిటి, బీర్బల్! తలకు ఆ గుడ్డేమిటి" అని అడిగాడు.

కాజ వెంకటరావు

"తల నొప్పి జాస్తిగా వుండటం వలన ఇలా కట్టుకోవాల్సివచ్చింది." బాధపడుతున్నట్లుగా నటిస్తూ సమాధాన మిచ్చాడు బీర్బల్. "అలాగా! అయితే విను. నేను ఒక ఆకు పేరు చెబుతాను. ఆ ఆకుల పసరు కణతలకు రాసుకుంటే నీబాధ వెంటనే పోతుంది" అని ఒక ఆకు పేరు చెప్పాడు ఆ స్నేహితుడు. బీర్బల్ వెంటనే ఒక పుస్తకం తీసి అందులో ఆ స్నేహితుని పేరు, అతడు చెప్పిన ఆ ఆకుపేరు వ్రాసుకున్నాడు. మళ్లీ నడక మొదలు పెట్టాడు బీర్బల్. ఎదురుగా వజీర్ వచ్చాడు. "ఏమిటిది" అన్నట్లుగా బీర్బల్ తలవంక జూచాడు. బీర్బల్ తన బాధను వెళ్ళబోసుకున్నాడు. "ఓస్, యింతే గదా! నేనొక మందు చెబుతా. రెండు మాత్రలు వేసుకున్నావంటే నీబాధ మాయమవుతుంది." అని వజీరు ఆమందు పేరును చెప్పి వెళ్ళిపోయాడు. బీర్బల్ అతడి పేరును, అతడు చెప్పిన మాత్రల పేరును పుస్తకంలోకి ఎక్కించాడు. ఈ విధంగా బీర్బల్ సభా మందిరంలో ప్రవేశించే లోగా అనేకమంది అనేక రకాల మందులు చెప్పారు. వారి పేర్లు, వారు చెప్పిన మందుల పేర్లు ఎంతో ఓపికతో బీర్బల్ తన పుస్తకంలోకి ఎక్కించాడు.

బీర్బల్ సభామందిరంలో ప్రవేశించగానే అక్బరు పాదుషా అతడి వాలకాన్ని జూచి ఆదుర్దాగా, "అలా వున్నావేం, బీర్బల్?" అన్నాడు.

బీర్బల్ "చిత్తం, మహాప్రభూ! విపరీతమైన తలపోటుతో చచ్చిపోతున్నాను." అన్నాడు చేతులు కట్టుకుని, సవినయంగా. "అలాగా, పాపం!......ఆ, చూడు! నే నొక లేహ్యాం పేరు చెబుతా. దాన్ని తలకు మర్దన చేశావంటే క్షణంలో నీబాధ పోతుంది," అని, అక్బరు పాదుషా ఆ లేహ్యాంపేరు చెప్పాడో, లేదో మన బీర్బల్ పుస్తకం పైకి తీసి ఏదో రాయడం మొదలు

 **అంతా వైద్యులే!** 

పెట్టాడు.

"ఏమిటి, బీర్బల్! వ్రాస్తున్నావ్?" అర్థం గాక అడిగాడు అక్బరు.

"చిత్తం. ఏమీ లేదు, మహా ప్రభూ! మీ పేరూ, మీరు చెప్పిన లేహ్యం పేరూ వ్రాసుకుంటున్నాను. చాలామంది, చాలామందులు వాడమని చెప్పారు. అవన్నీ గుర్తుండవని వారి పేర్లూ, వారు చెప్పిన మందుల పేర్లూ ఈపుస్తకంలో వ్రాస్తున్నా," అని బదులు చెప్పి ఆ పుస్తకాన్ని పాదుషాకు అందించాడు బీర్బల్.

అక్బరు పాదుషా ఆశ్చర్య పోయాడు.

"ఇప్పుడయినా తెలిసిందా ప్రభూ? ప్రపంచంలో ఎక్కువ మంది చేసేవృత్తి వైద్య వృత్తియే", అని చిరునవ్వుతో అని తలకు కట్టిన గుడ్డను తీసేశాడు బీర్బల్.

అక్బర్ పాదుషా, బీర్బల్ యొక్క బుద్ధి కుశలతకు మెచ్చుకుని బహుమాన మిచ్చాడు.

సభలో అందరూ బీర్బల్ తెలివి తేటలకు అచ్చెరువందారు. 





# ★ దగాపడిన తమ్ముడు ★

(20-వ పేజీ తరువాయి)

డానికే జాగాలేదు. ఏమైనా తనొక యిల్లు తీసుకోవాలి, అక్కడక్కడా ఖాళీవున్నా వాటిఅద్దె నెలకు ఐదు రూపాయలనుంచి పదిరూపాయలవరకూ వున్నయ్. ఒక నెల అడ్వాన్సుయివ్వాలి. అడ్వాన్సు యిచ్చివేస్తే తనదగ్గర మిగిలిందేముంది?

తిరుగుతూ తిరుగుతూ పొద్దు తలమీద కొచ్చేసరికి సముద్రపొడ్డు చేరాడు. మల్లు సముద్రం చూడగానే భయపడకుండా గెంతుతూ సంతోషంగా "అయ్యా అయ్యా! ఎంతసెరువో..." అన్నాడు తొలిసారి జీవితంలో సముద్రాల్ని చూడటం. పుల్లయ్య నవ్వి "సెరువు కాదయ్యా సవంద్రం — సవంద్రం!"

"సవంద్రం అంటే యేంటయ్యా"

"నీరు వుప్పగా వుంటాది—ఆ నీరునుంచి వుప్పుగడ్డలు పండుతాయి"

"నాగలేసి దున్నగలమా పండడానికి?"

"ఆనీరు మడుల్లోను పెట్టారు. అది యెండిపోయి వుప్పవుతాది?"

"అయ్యా! యీనీరు గంజిలో యేసుకుంటే—ఉప్పు కావాలా?"

"నీరు యేసుకోరులే..." అంటూ చెయ్యి పట్టుకొని సముద్రపువొడ్డుకు తీసుకవెళ్లాడు. అప్పుడే హార్బరునుంచి స్టీమరు వెళిపోవటం చూసి "అయ్యా అయ్యా...నూడు నూడు.. అమ్మో...ఎంతదుంది?"

"ఓడ అయ్యా అది. అదెక్కితే రంగం యెల్లిపోతాం?"

"అయ్యా యెక్కుదామా?"

"ఇప్పుడు కాదులే...పద! యిల్లు కుదరాలి—పని కుదరాలి..అప్పుడు యెక్కడికైనా యెల్దాం"

అంటూ తిరిగి సత్రంకు వచ్చాడు. కుర్రవాడి కాళ్లు బాగా పీకట్టాయ్. భోజనం చేసి తండ్రి పడుకున్నాడు. కొడుకు తన కాళ్లు తనే పట్టుకుంటూ కుక్కపిల్లతో కాళ్లునొప్పి అని చెప్పుకుంటున్నాడు. ఆ కుక్కపిల్ల, కాళ్లొకసారి నాకింది.

పుల్లయ్య నిద్దరనుంచి లేచేసరికి పందిరలో చాలామంది వెళ్లిపోయారు. రాత్రి సరికి బహుశః ఒంటిగా వుండవలసివుంటుందేమో ననిపించింది. నీలితో యిల్లుదొరకడం కష్టమని. పడ్డ శ్రమంతా చెప్పాడు. దెబ్బ తగలడంవల పుల్లయ్య నుదురువాంగివుంది. నీలి తానే యెతికివస్తానని బయలుదేరితే దారి తప్పిపోగలవని మొగుడనటంతో "నోరుంటే వూరుకరువా? నివ్వులే నీకే యిల్లొనచ్చవు. మనబతుక్కి మేడలూ మిద్దెలూ కావాలంటే యెలాగవస్తాయి? వచ్చినా అందులో వుండగలమా? ముఖానికి తగ్గబొట్టు పెట్టేనే కళగా వుంటాది." అని యింత సమాధానం చెప్పి ఒంటిగా బయలుదేరింది.

సాయంత్రం అయ్యేసరికి నీలి తిరిగిరాగానే పుల్లయ్య గుండె కుదుటపడి "యెతకడానికి రావాలనుకుంటే వచ్చినావు" అన్నాడు.

"పెద్దసత్రవు యెక్కడని దారిపోయేవారాల్ని అడిగితే సెప్పినారు," అంది నవ్వి.

"ఇల్లు దొరికిందా?"

"ఏదో తలదాసుకోడానికి యిరుగూ పొరుగూవున్న కొంపేలే. యిక్కడ నాలుగు మెతుకులు నవిలేసి రాత్తిరికి యెలిపోదాం" అన్నది.

"తోవ తెలుస్తాదా?" అన్నాడు.

"ఇదిగో యెంతో దూరం లేదు. అకు బారికి యెత్తె తోవ లేదూ? ఆ రోడ్డు పక్కనే-కాలవున్నాది. రోడ్డు మీద మత్రి సెట్టుంది."

(ఇంకా వుంది)

# ★ సంసారంలో శారద ★

(23-వ పేజీ తరువాయి)

అని వెనక్కు తిరిగి వెళ్లిపోయాడు.

ఆవాళ సినిమాకు వెళ్దామని చంద్రం చెప్పివెళ్ళిన సంగతి అప్పుడు గాని శారదకు గుర్తురాలేదు.

చంద్రం కాళ్ళు చేతులు కడుక్కొని వచ్చి కుర్చీలో శారద వదిలేసిన పత్రికను చూస్తూ కూర్చున్నాడు శారద లోపలకు వెళ్ళి కాఫీతో తిరిగి వస్తూ "అందులో నేటి సమాజంలో స్త్రీ" అనే వ్యాసం చదివారా? అంది.

"యేం?" చంద్రం కాఫీ కప్పు తీసుకుంటూ అడిగాడు.

"యేం లేదు. చదివారా లేదా అని మాత్రమే అడుగుతున్నాను." చేతులోని ఫ్లాస్క్ టేబిల్ మీద పెట్టటానికి వెళ్తూ అంది.

"ఆ!" క్రింద నుంచి పైకి ఒకేలా వుండి చివర మెలికలు తిరిగివున్న శారద జడను చూస్తూ అన్నాడు చంద్రం.

"యెలా వుంది?"

"బాగానే వుంది."

"బాగానే వుంది." కాఫీకప్పు పెదవులకు తాకించుకుంటూ అన్నాడు.

"అవును లెండి. మీరు మాత్రం మగవారు కాదు. జాతి పక్షపాతం పోనిస్తారా?" శారద కళ్ళముందు యేనాటిదో రచయిత రూపం కదిలింది. "పనీపాట లేకపోతే సరి. అయినా యీ రోజుల్లో కాని విలువ చెయ్యని చవటలు కూడా రచయితలు కాబట్టి కాలం యిలా భగ్గుమని నిప్పులేకుండానే మండిపోతుంది." అంటూ వెనక్కు తిరిగి చూడకుండానే శారద లోపలకు వెళ్ళిపోయింది. ఒకవేళ వెనక్కు తిరిగి చూసినట్లయితే కాఫీ తాగడం మర్చిపోయి నిశ్చేష్టంగా తన వైపు చూస్తున్న భర్తని గమనించగలిగేది.

మళ్ళీ వెంటనే తిరిగి వచ్చింది. లోపల యేదో పనిచేసి వచ్చినట్లుంది చేతులు తుడుచుకుంటూ, "స్త్రీలు తప్ప మరో విషయం దొరకలేదు మహానుభావుడికి. స్వామిరంగా! ఆ రచయిత నాకు తెలియాల్సింది. చెప్పేదాన్ని. విధవ భావాలకి పట్టిన బూజుని క్షణంలో దులిపే దానిని."

చంద్రం లేచి నిలువుటద్దం ముందు నిలబడి తల దువ్వుకోసాగాడు. అతని బిగించిన పెదవులు అదరటం మొదలు పెట్టాయి.

"అసలు మీ మగవాళ్ళకే చదువు అనవసరం అంటాను. లేకపోతే-" శారద వాక్యం పూర్తి చేయలేదు. చంద్రం మధ్యలోనే వెనక్కు తిరిగి "నోర్ముయ్. వాగకు" అన్నాడు తీవ్రంగా.

శారద నోరు ఈ హఠాత్తుగర్జనతో మాట నొక్కినట్లు మూతపడింది. నోరు తెరుచుకుని కళ్ళుమరింత పెద్దవిచేసుకుని భర్తముఖంలోకి చూస్తూ అలాగే నిలబడి పోయింది.

"ఆ వ్యాసం వ్రాసింది నేను. పరేవా. ఇహ వదులు నీ శరపరంపర" వెనక్కు తిరిగి మళ్లీ అద్దంలో చూచుకొని దువ్వుకోవటం మొదలుపెట్టాడు. శారద గొంతు పొడారి పోయింది. తన ఊహారచయిత యే మారుమూలలో యే గొందిలోనో లేడు. అతడు విద్యాహీనుడు కూడా కాదు. అతను నిత్యం నేటి సమాజంలో తిరుగుతున్నాడు. పెద్ద చదువులు చదువుకుని సభ్య సమాజంలో సంస్కార హృదయము గల నవీన నాగరికమూర్తిగా చెలామణి అవుతున్నాడు. అతనికి స్త్రీ స్పర్శ దూరంగాదు. అతను ఊహాలోకంలో స్త్రీలను చూడటంలేదు. నోట మాటరాక అలాగే చూస్తున్న శారదతో దగ్గరగా వచ్చి ఇలా అన్నాడు.

"నిజంగా ఈనాడు చెబుతున్నాను శారదా. మొదటినుంచీ స్త్రీ అంటే అంత వుపేక్షభావం కలగటానికి కారణం మా అత్తయ్య. అనుమానాలుగా, అసంపూర్ణంగా తొక్కిసలాడుతున్న యీ భావాలు మీ అత్తయ్య దర్శనంతో స్థిరరూపం దాల్చి గట్టి పునాదులేర్పరచుకున్నాయి. అప్పటికీ నా అభిప్రాయం తప్పేమోనని మా యింటికి వచ్చే స్త్రీలనొకరిద్దరిని పరీక్షచేశాను. వాళ్ళు మా అత్తయ్యకన్న, మీ అత్తయ్యకన్న మరో రెండు ఆకులు ఎక్కువ చదివినవారే గాని తక్కువ చదవలేదు. వీళ్లకే గనుక చదువు, విజ్ఞానం అనేదివుంటే మనుష్యుల్ని ప్రళయకాలంలో నటరాజనృత్యం చెయించరూ? ప్రపంచంలో ఇంకెన్ని ప్రపంచయుద్ధాలు వచ్చేవో" అన్నాడు. ఇప్పుడతని కంఠం చాలా మృదుమధురంగాను, వీనుల విందుగానూ వుంది.

మాట్లాడకుండా నిలబడి క్రిందకు చూస్తున్న శారదతో—"ఏం శారదా నాది తప్పు అభిప్రాయమంటావా? వాళ్లకే గనక చదువుంటే—" చంద్రం సాంతం మాట్లాడక ముందే శారద తలెత్తి నీళ్ళు నిండిన కళ్ళతో భర్త ముఖంలోకి చూస్తూ—"లేదు. వారు చదువుకుని విజ్ఞానవంతులయినట్లయితే ఆవిధముగా వారెన్నటికీ వుండేవాళ్ళు గాదు." దృఢంగా అంది.

"లేదు. నీకు తెలియదు."

"లేదు. లేదు. నాకు తెలుసు నన్ను చెప్పనివ్వండి. నిజమైనవిజ్ఞానంగనుక వుంటేవాళ్లా మూర్ఖపు భావాల్లో వుండేవారుగాదు. సరే మరి నా విషయంలో గూడా మీ అభిప్రాయం..." శారద కంఠంలోంచి తర్వాత మాట పెగల్లేదు.

"లేదు శారదా. నిన్ను చూచినప్పుడే నేననుకున్నాను. నేనంతకుముందు స్త్రీలలో యీభాగం చూడలేదని. ఇప్పుడిప్పుడే స్త్రీలపట నా అభిప్రాయాలు మారుతున్నాయి గూడా" అన్నాడు చంద్రం.

"అయితే పునాదుల్లో కదలిక ప్రారంభమయిందన్నమాట."

"ఆ. అవి యింకా యెంతోకాలం నిలవవుగూడాను. త్వరలో నీ సాంగత్యంతో సమూలంగా నాశనమైపోతాయి." ఇది చంద్రం అసలు స్వరూపం. అతని కంఠంలో హేళనగాని వ్యంగ్యంగాని లేవు.

"కృతజ్ఞరాలిని" అన్నది శారద వినయపూర్వకంగా తలవంచి.

"ఆమాట అనవలసింది నేను గాని నువ్వుగాదు." చంద్రం అంటుండగానే గడియారం ఆరుగంటలు కొట్టింది.

"ఇంక సినిమాకు పోదాం. త్వరగా తయారయిరా." అన్నాడు చంద్రం తృప్తి నిండిన మనసుతో శారద లోపలకు వెళ్ళిపోయింది. చంద్రం తనుకూడా డ్రస్ చేసుకోవటానికి తనగదిలోకి వెళ్ళిపోయాడు లోపలకు వెళ్ళిన శారద సినిమా మాట మర్చిపోయి జరిగిందంతా మొహర్‌కి వుత్తరం వ్రాసుకోవటానికి కూర్చుండిపోయింది. ★

# ఆనాటి రాత్రి

(15 వ పేజీ తరువాయి)

రావుకంక చూసి. ఆనందరావూ, డ్రైవరు అతనికి తమసలాములు చెప్పి కారులోకి ఎక్కారు. కారును డ్రైవరు 'స్టార్టు' చేసాడు. ఆ రజాకార్ల గుంపు సూర్యారావు పేటవైపు దారి తీశారు నినాదాలు చేసుకొంటూ. ఆనందరావునూ కారులోకి ఎక్కి "హమ్మయ్యా!" అనుకొన్నాడు. కారును శోధించకుండా వదిలిపెట్టిన వాళ్ళ బుద్ధిహీనతకు నవ్వుకొన్నాడు. కారు రెండుగజాలు ముందుకు సాగింది. లోపలనుంచి సాయుధపోలీసులు మధ్య తెర తొలిగించి ఆనందరావుతో మాట్లాడారు.

"నీ విజిలుకోసం ఎదురు చూస్తున్నాము. లేకపోతే ఎప్పుడో కాల్పులు సాగించేవాళ్ళం. ఈపాటికి వాళ్ళు రోడ్డుమీద మట్టి రుచి చూస్తుండే వాళ్ళు" అన్నాడు ఒకడు.

"అవును. మీరుసిద్ధంగావుంటారనే సంగతి తెలుసు. కాని విజిల్ వూదేలోగానే నన్ను వాళ్ళు కాల్చేసి ఉండేవాళ్ళు. అప్పుడు మీకు గూడా ప్రమాదం జరిగేది. కారుకు ప్రక్కనేవున్న వాళ్ళను కాల్చడానికి మీ మరతుపాకులకు సాధ్యమయ్యేది కాదేమో?" అన్నాడు ఆనందరావు.

అప్పటికి రజాకార్ల గుంపుకీ, అంబులెన్సు కారుకీ మధ్య దాదాపు వందగజాలదూరం ఏర్పడింది.

"సరే ఇప్పుడైనా వుత్తర్వులిస్తే క్షణంలో వాళ్లను యమ సదనానికి పంపిస్తాము. శత్రు శేషం ఎప్పుడూ వుంచకూడదని" అన్నాడు ఒక సాయుధ పోలీసు.

"అంతవరకు బాగానే వున్నది. వాళ్లు శత్రువులే కావచ్చు. కాని మమ్మల్ని— చేతికి చిక్కిన వాళ్లని వదిలిపెట్టారు. లేకపోతే మేమీపాటికి యమపురికి బంటులుగా కాపలా కాస్తుండేవాళ్ళం." అన్నాడు ఆనందరావు.

"అందుకని వాళ్ళని వదిలివేద్దామంటావా?" అన్నాడు వాళ్లల్లో ఒకడు.

"కాదు. కాని ఏమరివున్న వాళ్ల మీద దొంగచాటుగా తుపాకులు ప్రయోగించటం న్యాయంకాదు. నేను రివాల్వరుతో పైకి కాలుస్తాను. అప్పుడు వాళ్లు వెనకకు తిరిగి సిద్ధంగా వుంటారు. అప్పుడు మీపని పూర్తి చేసుకోండి." అన్నాడు ఆనందరావు. అందుకు సాయుధ పోలీసులు అంగీకరించారు. కారుకు వెనకవైపున తెరతొలగించి అక్కడ తమ మర తుపాకులలో సిద్ధంగా వున్నారు. లోపల రోగులిద్దరు స్మృతి లేకుండా పడి వున్నారు. ఆనందరావు రివాల్వరు తీసుకుని గాలిలోకి కాల్చాడు. ఆ నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ రివాల్వరు గుండెల గుభేలుమనేటట్లు మ్రోగింది.

సుమారు అరఫర్లాంగు దూరంలోవున్న రజాకారులు రివాల్వరు మ్రోత విని అకస్మాత్తుగా వెనక్కి తిరిగారు. భయ సంభ్రమాశ్చర్యాలతో ఆదుర్దాగా తమ తుపాకులను బారు చేసుకుంటున్నారు అంబులెన్సు కారు వేపు. కాని ఇంతలో సాయుధపోలీసులు తమ మరతుపాకులను ఒక్కటీ రెండు ప్రేల్చారు. ఆ ప్రదేశమంతా తుపాకిగుండ్ల మ్రోతతో మారు మ్రోగింది. ఒక్కక్షణంలో రజాకారులందరూ భూదేవిని కౌగలించుకొన్నారు. వాళ్లు పన్నెండుమంది మొదలు నరికిన వృక్షాల్లా రోడ్డుమీద కూలారు. రక్తం ధారలుగా వారి శరీరాలనుండి ప్రవహించింది. ఆనందరావు ఆ [illegible]న్ని భయం భయంగా పరికిసు[illegible] ఒక్కొక్క గుండు దెబ్బ తగిలి [illegible]న్నెండుమంది రజాకారులూ ఎల[illegible]యింది అతను విచారంతో గమని[illegible] వారి మరణం చూసి దిగ్భ్రాంతుడ[illegible]డు. అతని మనసు మనసులో లేదు.

కారు ఒక్క[illegible] ఆగలేదు. కాల్పులు [illegible]క్షణం[illegible]శర వేగంతో విజయవాడవైపు [illegible]యగెత్తింది. దారిలో కేసరి బ్రిడ్జివద్ద ఆనందరావు దిగి రివాల్వరునూ, సాయుధపోలీసులనూ కమాండరుకు అప్పగించాడు. జరిగిన గాథంతా కమాండరు ఆనందరావువలన విన్నాడు. ఆనందరావును కమాండరు, సమయానుకూలంగా ప్రవర్తించినందుకు అభినందించాడు. కమాండరువద్ద సెలవు తీసుకొని ఆనందరావు అంబులెన్సులో విజయవాడ ఆస్పత్రికి చేరుకొని రోగులను ఎం. డి. యం. వో. గారికి అప్పగించి తన కర్తవ్యం నిర్వహించాడు. ఆయనగూడా జరిగిన సంగతి తెలుసుకొని రోగులకు గానీ, తమకు గానీ, ప్రభుత్వఆస్తి అయిన అంబులెన్సుకు గాని ఏ విధమైన నష్టమూ కలుగకుండా తన పని నెరవేర్చినందుకు అభినందించాడు ఆనందరావును. ఆనందరావుకు ప్రభుత్వంవారి బహుమానం లభించింది ధనరూపంలో. సాయుధపోలీసులిద్దరికీ ప్రభుత్వంవారు పోలీసు మెడల్స్ బహూకరించారు. పై గాథ తలపుకు వచ్చినప్పుడల్లా ఆనందరావు కళ్లు జలదరించిపోతుంది.



## అవహేళనల నెదుర్కొనే అభాగినులు

కాకుండా, తమంతట తాము జీవించగల అవకాశాలు సమాజం కల్పించాలి. మరొక ముఖ్య విషయమేమంటే మూఢ విశ్వాసాలకు సంబంధించినంతవరకూ స్త్రీలే మరింత వెనుకబడి వున్నారు. కాబట్టి వారి మనస్తత్వంలో మార్పు తేవటానికి ప్రయత్నించాలి. చదువూ, సంస్కారము గల యువతులపైనే ఈ బాధ్యత ఎంతోవుంది. సామాజికాభివృద్ధివిషయంలో వారిపాత్ర నేడు చాలా ప్రధానమైనది. ★



# సినిమా

ముడిఫిలిం కోత పెట్టడంతో, వేసవి వాతావరణంలాగే వార్తావరణంకూడా వేడెక్కిపోయింది. చిత్రాలు తీసేవారూ, చూసేవారూ కంగారుపడ్డారు. పెద్దలు ఢిల్లీ వెళ్ళారు రాయబారాలు జరపడానికి. ముడిఫిలిం చీకటిధరలు, బొంబాయి స్టార్ల రేట్లులాగే జువ్వలల్లె తారాపథానికెగిరాయి. హఠాత్తుగా, మొన్న పేటుతిరిగి, అదనంగా వచ్చిపడ్డ కోత (20%) తగ్గడంతో ఆందోళన కొద్దిగా ఉపశమించింది.

* * *

దేశవాళీ జెమ్స్‌డీన్, విదేశ యాత్రలకు వెళ్లాడు. ఇటీవల ఒక సినీఫాన్ పత్రికలో ఈ నటుడి (షమ్మీకపూర్) జీవితాశయాలూ, దృక్పథాలనూ, 'ఫోటోజెనిక్ ఫిలాసఫీ' అనబడే, ఒకరకం సినీ వేదాంతాన్నీ వివరిస్తూ వెలువడిన వ్యాసంలో, ఇతను తిరుగుబాటుచెయ్యాలని మనసుపడుతున్నట్లు వ్రాశారు. ఎటొచ్చి, దేనిమీద తిరుగుబాటు

## బొంబాయి సినిమా లేఖ

చెయ్యాలో, దేన్ని ఎదిరించాలో ఇంకా తెల్సుకోలేదనీ, తేల్చుకోలేదనీ వెల్లడిచేశారు. అయితే, ఈయన జపాన్ ఎందుకు వెళ్తునట్టు? దేనిమీద తిరుగుబాటుచెయ్యాలో తెలుసుకోవడానికేనని మీరు అనుకుంటే పొరబాటు. కేవలం విశ్రాంతికోసం, సరదాగానూ వెళ్తున్నట్లు ఆయన తెలియజేశారు. కనీసం ఇండియా జపాన్‌లు కలిసి తీయబోయే బ్రహ్మాండమైనచిత్రం నిర్మాణం గురించిన చిన్న వివరాలు మాట్లాడి రావడానికా అని అడిగితే 'అది పచ్చిఅబద్ధం. నేనలా బడాయికిపోవటం లేదు' అన్నాడు షమ్మీకపూర్.

* * *

"లోకల్ మార్లాన్ బ్రాండో" అనిపించుకున్న సునీల్ దత్, ఇప్పుడు పూర్తిగా మారిపోయాడు. అర్ధరాత్రివేళ హఠాత్తుగా నిద్రలేచి కారెక్కి, తీచికెళ్ళి దిక్కుమొహం

ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్‌వారి 'వీరప్రతాప్'లో పద్మిని

పెట్టి, నవ్వుకుని ఇంటికిరావడంతంటే అలవాట్లన్నీ చెరిపేశాడు. నిండుగా, ఉత్సాహభరితంగా, రోజులుగడుపుతూ, స్థిమితంగా సంసారయాత్ర సాగిస్తున్నాడు. పెళ్లి అయిన తరవాత ఇంతవరకు సునీల్ నర్గీస్ లు హనీమూన్‌కు వెళ్ళలేదు. అంతకుముందు వివిధ నిర్మాతలకు ఇచ్చిన వాగ్దానాల ప్రకారం, సరిపనులూ దెబ్బతినకుండా, ఎవరికీ నష్టం రాకుండా, రెండుపూటలా స్టుడియోలకు వెళ్ళి కష్టపడి పనిచేస్తున్నారు.

"ఆగస్టుకు పని తెరిపి అవుతుందనుకుంటున్నాము. అపుడు, కొన్నాళ్ళు స్టుడియోల పనికి సెలవుపెట్టి, విహారయాత్రకు వెళ్ళి విశ్రాంతి తీసుకుంటాం" అన్నారు.

బాంద్రాలోని పాలీహిల్ వద్ద సునీల్ బ్రహ్మాండమైన ఇల్లు కొన్నాడు. ఢిల్లీ లాల్ ఖిల్లాలా పెద్దదని కాదు కాని, చెట్లూ, తోటలూ, చిక్కటినీడలూ, చల్లటి వెలుగూ అంటే ఇష్టం ఉన్నవారికి ఇది భూలోక స్వర్గంలాంటిది. రెండంతస్తుల మేడ. చుట్టూరా చెట్లు. విశాలమైన ఆవరణలూ పొదలూ, లతలూను. దూరాన నీలాభ్రం; క్రింద సముద్రం...

త్వరలోనే ఇక్కడ కాపురం పెడదామని ఏర్పాట్లు చేసుకుంటున్నారు.

## చందన్

జ్యోతి ఫిలింస్ వారి "చందన్" మొన్న విడుదల అయింది. ఈ మధ్య తెలుగులోనూ, ఆ మధ్య అరవంలోనూ వచ్చిన రెండు చిత్రాల కథ ఇందులో హిందీ వేషం వేసుకున్నా, మరోమారు చూడవచ్చు. ఎందుకంటే, ఇది అచ్చంగా 'రొమాంటిక్' ప్రొడక్షన్. వినోదకాలక్షేపానికి నిధి అనిపించుకునే విధంగా, పాటలతో, డాన్సులతో ఉద్వేగం పెల్లుబికే సన్నివేశాలతో, బోలెడంత హాస్యంతో, ఇంకా సకల బాక్సాఫీస్ హంగులతో జనరంజకమైన చిత్రాలు తీసే ఎం. వి. రామన్ దీనికి దర్శకుడు. అందుచేత ఆయన పద్ధతిలో ఇదీ గట్టికథతో, వినోదంతో, కొత్తదిగా తయారైంది. ఒక జడ్జిగారు చనిపోవడంతో బావమరది, పుంజాజుని ఆస్తికి వారసులైన ఆయన కుమారులిద్దరినీ, ఆఖరుకు తన స్వంత చెల్లెలినీ చంపబోతాడు. ఆమె పిల్లలతో పారిపోతుంది. కథ బలీయమైనందువల్ల, వాళ్లిద్దరూ తప్పిపోతారు. ఈలోగా ఆమెమీద ఎవరో ఖూనీ నేరం బనాయిస్తారు. ఖైదుశిక్ష ముగిసి తిరిగివచ్చేసరికి, ఆమె కొడుకులు చెరో చోటా పెరిగి పెద్దవాళ్ళవుతారు. కాని, తల్లిని గుర్తుపట్టలేరు. చిన్నవాడు చందన్ బీదవాడుగా పెరుగుతాడు. పెద్దవాడు గోపాల్ ఒక క్రైస్తవాచార్యుడి సహాయంతో చదువుకుని జడ్జీ అవుతాడు. చిన్నవాడి నెత్తిన ఖూనీ నేరాలు పడతాయి. విచారణలో (తెలుగు తమిళ చిత్రాలోకన్నా కాస్త గటిసాక్ష్యం కుదిరినందువల్ల,) ముద్దాయి నిర్దోషి అని ఋజువు అవుతుంది. అన్న, తమ్ముడు, తల్లిని తెలుసుకుంటారు. ఆనక అంతా సుఖంగా ఉంటారు.

ఈవిధంగా కథలో, సహజత్వం పుష్కలంగా ఉండడం జరగకపోయినా, చూస్తున్నంతసేపూ రక్తికడుతుంది. చందన్ గా కిషోర్ కుమార్, సకల విధాలా అల్లరిచేస్తాడు. అది చూట్టానికి బాగుంటుంది. గోపాల్ గా కరన్ దివాన్ నటన అమోఘంగా లేదు. లాయరుగా నూతన్, గోపాల్ భార్యగా మాలా సిన్హా మనోహరంగా ఉన్నారు. మనోహరంగా ఉన్న మరికొన్ని అంశాలు ఫాలి మిస్త్రీ ఛాయాగ్రహణం, కమలా లక్ష్మణ్ నృత్యాలూ, రాజేంద్ర కిషన్ సంభాషణలూను. ముఖ్యంగా కమలా లక్ష్మణ్ మహారాష్ట్రనృత్యం, గేవా కలర్ లో చిత్రించిన మరో బృంద నృత్యం చాలా బాగున్నాయి. మదనమోహన సంగీతం వినులవిందుగా ఉంది.*



"శైలా! అద్రసు తెలియక అల్లాడిపోతి" అంటే "వెళ్ళి వెదకు ఎడారి దారులా" అంటూవుంది ప్రియంవద గుర్నాథంతో —రిపబ్లిక్ వారి పెళ్ళిసందడిలో ఒక హాస్య సన్నివేశంలో సరోజాదేవి, చలం.



కాశీనాథ్ వారి 'శ్రీరామాంజనేయ యుద్ధం'లో సంధ్య.

# రంగారావు గృహప్రవేశం

తెలుగు చిత్రసీమలో గతవారం రెండు శుభకార్యాలు జరిగాయి. మొదటిది— ఏప్రిల్ 30 సాయంకాలం, సుప్రసిద్ధ నటుడు శ్రీ ఎస్. వి. రంగారావు నూతన గృహప్రవేశం; రెండవది, ఆ మర్నాడు, ఆ మర్నాడూ జరిగిన, హాస్యనట చక్రవర్తి శ్రీ రేలంగి వెంకటరామయ్య కుమారుడి వివాహం. రెండూ చాలా వైభవంగా జరిగాయి. చిత్ర పరిశ్రమలో చిన్నా పెద్దా అందరూ శుభ ముహూర్తాలకు వచ్చి ఉత్సవ ఉత్సాహంలో పాలుపంచుకొన్నారు.

రంగారావు నూతన గృహం త్యాగరాయ నగర్, హబిబుల్లా రోడ్‌లో, నటి సావిత్రి కొత్తయింటికి ఎదురుగా ఉంది. విశాలమైన ఆవరణ మధ్య, చక్కని మేడ. ఏప్రిల్ 30కి మూడురోజుల ముందరనుండి, రంగారావు, దగ్గర ఉండి, అలంకరణ, ఇతర ఏర్పాట్లు చేయించారు. రంగారావు, తెలుగు దేశంలో ఎంతటి పేరు ప్రఖ్యాతులు గడించుకొన్నారో, తమిళనాడులోనూ అంతటి గౌరవాభిమానాలు సంపాదించుకొన్నారు. అందుచేత, గృహప్రవేశ ముహూర్తానికి, తెలుగు తమిళ పరిశ్రమలకు చెందిన దాదాపు మూడు వేలమందివచ్చి, ఘనంగా ఉత్సవం జరిపించారు. గెస్టును అభినందించవచ్చిన దోస్తులంతా, పుష్కలంగా కానుకలు చదివించారు.

విందు భోజనాల తరువాత, పద్మశ్రీ ద్వారం వెంకటస్వామినాయుడుగారి గానసభ జరిగింది. పక్క వాద్యాలు: శ్రీమతి ద్వారం మంగతాయారు వయొలిన్, మార్దంగిక శేఖర శ్రీ కోలంక వెంకటరాజు మృదంగం వాయించారు.

# రేలంగి కుమారుడి పెండ్లి

మే 1 సాయంకాలం, కోడంబాకంలోని విజయా గార్డెన్స్, రంగురంగుల దీపావళితో శోభయమానంగా అలంకరించబడింది. గత జూన్‌లో నాగేశ్వరరావు వజ్రోత్సవానికి నాగిరెడ్డిగారు సృష్టించిన 'మాయాబజార్' ఇదే. ఈసారి రేలంగి వెంకటరామయ్య, తన కుమారుడి వివాహ మహోత్సవానికి, దీన్ని మరింత మనోహరంగా ముస్తాబు చేశారు. ఈసారి ఇది 'గేవాకలర్ మాయాబజార్'గా ఉంది అని చూడవచ్చిన అతిథి ఒకరు మెచ్చుకు సంబరపడ్డారు... 'విజయోద్యానవనం'లో వెల్లివిరిసిన ఉత్సాహం అదీ చూచి మోతగా ఉంది అన్నాడు తెనాలి నుండి వచ్చిన ఒక యువకుడు. 'ప్రమాదమాకిది' అన్నాడో తమిళ ప్రముఖుడు.

* * *

వరుడి పేరు చి॥ సత్యనారాయణబాబు. ఈ జూనియర్ రేలంగిని 'స్వయంప్రభ' చిత్రంలో మీరు చూచివుంటారు. వధువు చి॥ సౌ॥ కుసుమకుమారి. తాడేపల్లిగూడెం వాస్తవ్యులు శ్రీ చేబ్రోలు పెద్దబ్బాయిగారి తృతీయకుమార్తె. మే 1వ తేదీ రాత్రి 7-44 గం॥లకు వివాహం జరిగింది. రేలంగి వెంకటరామయ్యగారి తండ్రి రామదాసుగారు, దగరవుండి మనుమడిపెళ్లిని ఘనంగా జరిపించారు. చలనచిత్ర కళాకారులూ, అధికార అనధికార ప్రముఖులూ వచ్చి, వధూవరులను దీవించి, కానుకలు చదివించారు.

మర్నాడు రాత్రి విజయా గార్డెన్సులో దాదాపు ఐదు వేలమంది విందుభోజనాలకు హాజరవ్వారు. దేశంలో రేలంగికి ఉన్న అభిమానుల సంఖ్యనుబట్టి, మొగపెళ్ళివారిదే ఎక్కువ బలగం అని చెప్పకోవాలి.

విందు అనంతరం శ్రీ పి. సూరిబాబు బృందం తారాశశాంకం నాటకం వేశారు.

# సినిమా వార్తలు

న్యూటోన్ స్టుడియోస్ వారు, మహేశ్వరీ పిక్చర్స్ వారి 'కణ్ణిన్ మణిఘళ్' చిత్రాన్ని తెలుగులోకి అనువదించి 'కళ్ళ కలియుగం' అన్న పేరుతో విడుదల చేయబోతున్నారు. ఇందులో పద్మిని, [illegible] వి. రాజమ్మ, ఎం. కె. రాధ పాల్గొన్నారు. మాటలు కొటూరి మోహన్, పాటలు ఆరుద్ర వ్రాస్తున్నారు. నిర్వహణ సురటి దుర్గారావు. సంగీతం సి. ఎస్. పాండురంగం నిర్మాత దర్శకుడు టి. జానకిరాం.

## గుళ్లో పెళ్లి

చేతనా ఫిలింస్‌వారి సాంఘిక చిత్రం 'గుళ్లో పెళ్ళి' మూడురీళ్ళు పూర్తి అయింది. మొన్ననే కొత్తసెట్ మీద పని ఆరంభించారు. గ్రామీణ వాతావరణాన్ని ప్రతిబింబించే ఇతివృత్తంతో, కె. ఎస్. ప్రకాశ (దీతు) రావు దర్శకత్వాన రూపొందుతున్న ఈ చిత్రానికి అనిసెట్టి (దాంపత్యం) సుబ్బారావు మాటలూ పాటలూ వ్రాస్తున్నారు. 1957 పరిచయం చేసిన కొత్తనటుడు రమణమూర్తి, బాలయ్య ఇందులో ప్రముఖ పాత్రలు నిర్వహిస్తున్నారు. రమణారెడ్డి మరొక ముఖ్యనటుడు. కృష్ణకుమారి, సూర్యకాంతం, గుమ్మడి ప్రభృతులు పాల్గొంటున్నారు.

రమేష్ నాయుడు సంగీత దర్శకుడు. నిర్మాత గిరిబాబు.

* * *

అన్నపూర్ణా పిక్చర్స్‌వారి బృందం మే 6న ఊటీలో అవుట్‌డోర్ దృశ్యాల చిత్రణకై బయల్దేరి వెళ్ళింది. ఒక్క రంగారావు, రేలంగి మటుకు రెండు రోజులు ఆగి బయల్దేరుతున్నారు.

"గృహప్రవేశం" హడావుడి పూర్తి అయాక రంగారావు కొంచెం విశ్రాంతి తీసుకుంటున్నారు. అటు కాల్‌షీట్‌లు మానుకుంటూ, ఇటు ఇల్లు కట్టి, అందులో దిగే పని చేసుకొచ్చేసరికి, హైరాణ అనిపించింది.

అలాగే రేలంగి, పెళ్ళిపనులన్నీ తెముల్చుకునేసరికి, మనిషి నలిగిపోయాడు.

అందుకే 'పెళ్ళిచేసిచూడు' అని ఈయనా, 'కాదు; ఇల్లుకట్టి చూడు' ఆయనా ఛలోక్తులు విసిరారు.

యూనిటీ పిక్చర్స్ వారి 'బుల్లెబ్బాయి' చిత్ర నిర్మాణ బృందంకూడా ఊటీ వెళ్లారు. దర్శకుడు ముక్కామల, ముఖ్యనటుడు కాశీనాథరాజు, గుమ్మడి, నిర్మాత కేశవులంశెట్టి ముఖ్యులు.

## తెనాలి కళాశాలకు సినీనటుల సహాయం

మద్రాసునుండి గత వారం తెనాలి వెళ్లిన సినీనటుల, గాయకుల, టెక్నీషియన్ల బృందం అక్కడ 'కళా ప్రధాన నాట్య మండలి' పేరిట 'మనోహర' అనే నాటకం ప్రదర్శించి యాభైవేల రూపాయలు సేకరించి, తెనాలి కళాశాలలో సాంస్కృతిక కార్యక్రమ మందిర నిర్మాణానికి విరాళం ఇచ్చారు.

బయలుదేరి వెళ్లిన ఈ కళాకారుల బృందం ఉత్సాహానికి, తెనాలి, పరిసర గ్రామాల ప్రజల సహకారంతోడై ఈ ఘన కార్యం జయప్రదంగా నెరవేరింది. అంతేకాక, తెనాలిలో నాటక మందిర నిర్మాణానికి లక్ష రూపాయలు సేకరించి ఇవ్వడానికి కృషిచేస్తామని ఈ బృందంలో ప్రముఖులు శ్రీయుతులు కె. జగయ్య, గుమ్మడివెంకటేశ్వరరావు వాగ్దానం కూడా చేశారు.

ఏప్రిల్ 29న, అక్కడి పురపాలక పాఠశాల ఆవరణలో, వీరందరికీ పౌరసన్మానం జరిపి, తెనాలి పౌరులు తమ ఆనందాన్ని తెలియజేశారు. పురపాలక సంఘాధ్యక్షుడు శ్రీ ఎన్. వెంకట్రావు, సన్మానపత్రం చదివారు. నాట్యమండలి తరఫున నటి, శ్రీమతి జి. వరలక్ష్మి, సన్మానపత్రం స్వీకరించి, కృతజ్ఞత తెలిపారు. నాటకంలో ముఖ్యపాత్ర ధరించిన శ్రీ కె. (ఎం. ఎల్. ఎ.)-జగ్గయ్యను, కళాశాల పాలకవర్గం అధ్యక్షుడు శ్రీ వి. శ్రీరాములు, సభికులకు పరిచయంచేశారు. తరువాత, శ్రీ జగ్గయ్య, తోటి నటవర్గాన్ని, గాయకులను, టెక్నీషియన్లను పరిచయం చేశారు. కళాకారులందరినీ పూలమాలలు వేసి గౌరవించారు.

ఈ సందర్భంలోనే, శ్రీయుతులు జగ్గయ్య, గుమ్మడి వెంకటేశ్వరరావు, పద్మనాభం, కుమారి గిరిజ సన్మానానికి కృతజ్ఞత తెలిపారు.

'మనోహర' నాటకప్రదర్శనంలో, వివిధ పాత్రలలో పాల్గొన్నవారు: శ్రీయుతులు కె. జగ్గయ్య, గుమ్మడి వెంకటేశ్వరరావు, పెరుమాళ్ళు, పద్మనాభం, మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, రామకోటి, మోహన్, మాధవపెద్ది సత్యం, కె. వి. తిలక్, జి. కృష్ణమూర్తి, టి. ఎస్. కోదండపాణి, భద్రయ్య, కె. వెంకటరావు, నరసింహులు, అచ్యుత నారాయణరావు, శ్రీమతులు జి. వరలక్ష్మి, సీత, గిరిజ, ప్రమీల. ★

* * *

## నటి జానకికి పితృవియోగం

కాగితం తయారీ ప్రవీణుడుగా, ఆంధ్రలో కాగితం పరిశ్రమ అభివృద్ధికి చాలా దోహదంచేసిన శేకుమళ్ల వెంకోజీరావు గారు గత వారం కలకత్తాలో స్వర్గస్థులయ్యారు. ఆయన వయస్సు 60 ఏళ్ళు. సినీ నటి జానకి, కృష్ణకుమారి, ఆయన కుమార్తెలే. శ్రీమతి జానకి, తండ్రి మరణవార్త తెలియగానే, కలకత్తానుండి మద్రాసుకు ప్రత్యేక విమానంలో ఆయన భౌతిక కాయాన్ని తెప్పించింది. ఉత్తరక్రియలు మద్రాసులోనే జరిగాయి. పలువురు దర్శక నిర్మాతలూ, తోటి నటీనటులూ, జానకికీ, కృష్ణకుమారికీ, సానుభూతి తెలిపారు.

పొన్నలూరివారి 'శోభ'లో ముక్కామల.



# సోవియట్ నటులు, శిక్షణవిధానాలు

మాస్కో నగరంలోని వ్యవసాయ ప్రదర్శన శాలకు సమీపంలోనే సోవియట్ యూనియన్ ప్రభుత్వ సినిమాకళా నిలయం నెలకొని ఉన్నది. సినిమా ప్రపంచంలో పేరు ప్రఖ్యాతులు గడించుకోవాలని కలలుగనే యువతీయువకులు దేశం అన్ని ప్రాంతాల నుండి ఇక్కడికి వస్తుంటారు. సినిమాకళను వృత్తిగా స్వీకరించదలుచుకొనేవారికి శిక్షణను ఇవ్వడానికి ఈ విద్యాసంస్థలో ఐదు శాఖలున్నాయి.

కాబోయే సినిమానటులు నటనాశాఖలో విద్యను అభ్యసిస్తారు. కాని వారు విద్యార్థులుగా చేరబోయేముందు ప్రవేశ పరీక్షలో నెగ్గవలసిఉంటుంది. సినిమాప్రపంచంలోని ప్రఖ్యాత వ్యక్తుల సంఘం ఒకటి వారిని పరీక్షిస్తుంది. అలా పరీక్షించేటప్పుడు ఆ సంఘం అభ్యర్థులు ప్రజ్ఞావంతులా కాదా, సినిమా నటులయ్యే అర్హత వారికి ఉన్నదా లేదా, భావప్రకటనా సామర్థ్యం ఉన్నదా లేదా అన్న విషయాలను పరిశీలిస్తారు. ఇందులో చేర వచ్చేవందలాదియువతీయువకులలో అత్యంత ప్రజ్ఞావంతులయిన కొద్దిమంది మాత్రమే ఎన్నిక చేయబడుతారు.

## స్టుడియోలలో శిక్షణ

ఈసంస్థలో విద్యాభ్యాసం 'సృజనాత్మక స్టుడియోల సూత్రం' మీద ఆధారపడి ఉంటుంది. విద్యార్థులకు శిక్షణ నిచ్చే ప్రతి స్టుడియో-మొదటి సంవత్సరంనుండి చివరి ఐదవ సంవత్సరం వరకు - అనుభవజ్ఞులతో కూడిన ఒకే అధ్యాపకబృందం చేత నడుప బడుతుంది. తమారా మకరోవా, బోరిస్ బబోచ్కిన్, నీనా అలిసోవా మొదలైన ప్రఖ్యాత నటులు ఈ స్టుడియోలకు సారథ్యాన్ని వహిస్తుంటారు. వీరు తమ విద్యార్థులకు, కెమేరాముందు, కృత్రిమంగా ప్రయత్న పూర్వకంగా ఉన్నట్లుగాక సహజంగా నటించడాన్ని, సినిమా నటనకు సంబంధించిన క్లిష్ట విషయాలను నేర్పుతారు. ఈ విద్యాసంస్థలో ఉండగా నటనా కళావిద్యార్థులు భావప్రకటనను గురించీ, వాచ్యాన్ని గురించీ నేర్చుకోవడమేగాక, జాతి సంస్కృతి గురించికూడా సర్వం తెలుసుకొంటారు నాటకరంగం, సినిమారంగాలచరిత్రనుగురించీ సోవియెట్ దేశసాహిత్యం, విదేశీ సాహిత్యాలను గురించీ, సినిమా పరిశ్రమ మూల



నాలు వస్తాయి. ఒక్కొక్కప్పుడు ప్రధాన భూమికలను నిర్వహించడానికి కూడా ఆహ్వానాలు వస్తాయి. ఉదాహరణకు, 1957 లో ఉత్తమ నవలగా తెలుగు భాషా సమితి ఎన్నికచేసిన 'పెంకుటిల్లు' రచయిత శ్రీ కొమ్మూరి వేణుగోపాలరావు.

సూత్రాలనుగురించీ వారు తెలుసుకొంటారు. నటన నేర్చుకునే విద్యార్థులలో చాలా మంది తమ సృజనాత్మక కృషి ని రెండవ సంవత్సరంలోనే ప్రారంభిస్తారు. కొన్ని పాత్రలను అభినయించడానికి వారికి ఆహ్వానాలు రావచ్చు. ఉదాహరణకు లారా లుచ్కో ఇంకా ఈ విద్యాసంస్థలో విద్యార్థినిగా ఉంటుండగానే "యువ వీరులు" అన్న చలనచిత్రంలో పాత్రను నిర్వహించింది.

ఈ సంస్థలో విద్యాభ్యాసాన్ని పూర్తిగావించి పట్టభద్రులైనతర్వాత వారికి నటుల స్టుడియోలలోనో లేక దేశంలో వివిధ ప్రాంతాలలోఉన్న పెద్ద స్టుడియోలలోనో ఉద్యోగం ఇవ్వబడుతుంది.



రాఘవ స్మారక నాటకోత్సవాలలో ఉత్తమ నటిగా ఎన్నిక అయిన శ్రీమతి సి. హెచ్. పుష్పకుమారి (విజయవాడ). కొమ్మూరి వేణుగోపాలరావుగారి 'ఒక్కగంట' నాటిక లో ఈమె నటించింది.



విజయనగరంలో జరిగిన రాఘవ స్మారక నాటకోత్సవాలలో ఉత్తమ నటుడుగా ఎన్నిక అయిన శ్రీ ఎం. ఎస్. మూర్తి (విజయవాడ). బెల్లంకొండ రామదాసు గారి 'పునర్జన్మ' నాటకంలో ఈయన ముఖ్య పాత్ర ధరించారు.

చలనచిత్రంయొక్క విజయం దానిలోని ప్రధాన భూమికలకు అవసరమైన నటులను యెన్నిక చేసుకోవడం పైనా, చిత్రంలోని నటులందరి సమీకృత కృషిపైనా ఆధారపడి ఉంటుంది. దర్శకుడు తన చిత్రంలోని పాత్రలకు నటులను యెన్నుకోడానికి అనేక మందిని పరిశీలిసాడు. అలా చాలామందిని పరిశీలించిన అనంతరం "కెమేరా టెస్ట్" కొరకు కొందరిని ఏరుకొంటాడు. ఒక్కొక్కప్పుడు ఒక ప్రత్యేక పాత్రకు సినీ నటన వృత్తిలో ఉన్నవారెవ్వరూ సరిపోక పోవచ్చును. అలాంటప్పుడు ఆ స్టుడియోకి సంబంధించిన నటనా శాఖవారు తమ ఫిలిమ్‌లో నటించడానికి నాటకరంగానికి సంబంధించిన నటులను ఆహ్వానిస్తారు. నాటకరంగానికి సంబంధించిన నటులు, తరుచు సినిమాల్లో నటిస్తూనే ఉంటారు. ఒక్కొక్కసారి నాటకరంగ నటులు పూర్తిగా సినిమాలలోనే నటిస్తూ సినిమానటుల వృత్తిలోకి మారిపోతూ ఉండడం కూడా జరుగుతుంది. వాదిమిర్ యమెల్యనోవ్ విషయం ఇలాగే జరిగింది. పూర్వం అతడు నాటకాల్లో నటిస్తుండేవాడు, ఇప్పుడు సినిమానటనా కళలో పూర్తిగా నిమగ్నుడై పోవడం మూలాన నాటకరంగం నుండి విరమించుకొన్నాడు. "అజేయమైనరక్షణసేన", 'విద్యా శిక్షణ' అన్న సినిమాలద్వారా వ్లాదిమిర్ యమెల్యనోవ్ భారతీయ ప్రేక్షకులకు సుపరిచితుడే. దర్శకుడు తనకు ఒక ప్రత్యే

(56 వ పేజీ చూడుడు)

కొన్ని ఉన్నాయి. కాని అంతమాత్రంతో, సినిమాస్టుడియోలలోని వాతావరణంలో ఇలాంటిపాత్రల సృష్టికితగిన పరిస్థితులు లేవనుకోగూడదు.



జలరుహావారి 'రాజనందినిలో' అంజలీదేవి.

## ముడి ఫిలిం కోత

ఇటీవల పరిశ్రమలో పెద్ద సంచలనానికి కారణభూతమైన ముడి ఫిలిం కోత సమస్య కొద్దిగా దారికి వచ్చింది. శ్రీ బి. నాగిరెడ్డి నాయకత్వాన, దక్షిణ భారత నిర్మాతలూ, డిస్ట్రిబ్యూటర్లూ, ఎగ్జిబిటర్లూ సంఘటితంగా చేసిన ఆందోళన ఫలితంగా, ప్రభుత్వం ముడి ఫిలిం దిగుమతిలో మొన్న కొత్తగా ప్రకటించిన 20% కోతను రద్దు చేసింది. ఇంతవరకూ ఇది సంతోషించ తగవిషయమే. అయినా, గత జూలైలో ప్రవేశపెట్టిన 40% కోత, ఇంకా అలాగే ఉంది.

చిత్ర పారిశ్రామికుల ఆందోళన కొత్త కోత (20%) కే పరిమితం అయిందని అనుకోవడం పొరబాటు. ఇది ఇబ్బంది మీద అదనంగా వచ్చిపడ్డ ఇబ్బంది. అంతమాత్రాన పాత సమస్య తీరిపోదు. నిర్మాణంలో ఉన్న చిత్రాలెన్నింటికో ఫిలిం దొరకక, నిర్మాతలు నానాఅవస్థా పడుతున్నారు.

నూటికి 60 వంతుల దిగుమతి తగ్గించినప్పుడు ప్రభుత్వం పొదుపుచేసేది [illegible] తక్కువ అని నిరూపించబడింది కాబట్టి, ఇప్పుడు 40% కోత అలాగే ఉంచడంవల్ల పొదుపుచేసేది మరీ తక్కువగదా అని ఒక నిర్మాత అన్నారు. ఇది కేవలం తెలివిగా, చాకచక్యంగా చేస్తున్న వాదం కాదు, అంకెలు నిరూపించే నిజం. యాభై అరవై లక్షలు ఆదా చెయ్యడానికై, ప్రభుత్వం ఇటువంటి విధానం అవలంబించడం సబబు కాదు. ఈ కోతనుకూడా ఉపసంహరించడమే కాకుండా, మళ్లీ మళ్లీ ఇటువంటి ఉపద్రవాలు వచ్చిపడేందుకు ఆస్కారం లేకుండా సాధ్యమైనంత త్వరలో దేశంలో ముడిఫిలిం ఫాక్టరీ నిర్మాణానికి యేర్పాట్లు చేయడం వాంఛనీయం. అందుకు కాగల ఖర్చులో సగానికి సగం తాము భరించగలమని మద్రాసు చలనచిత్ర వణిక్ప్రముఖులు అంతా ప్రభుత్వానికి తెలియచేశారు. మనదేశం వచ్చిన జర్మన్ బృందం ఫాక్టరీ నిర్మాణానికి ఊటీ యోగ్యంగా ఉంటుందని స్థల నిర్ణయంకూడా చేశారు.

అందువల్ల ఇందుకు సంబంధించిన పథకాలగురించి ఆలోచించడం అవశ్యం వాంఛనీయం. 

## సోవియట్ నటులు, శిక్షణావిధానాలు

మైన పాత్రకు అవసరమైన నటుడుగాని, నటిగాని లభించకపోయినట్లయితే, నాటకరంగ నటీనటులనేగాక, నృత్యనాటక, సంగీతనాటక రంగాల నటీనటులనుగూడా పరిశీలించి ఏరుకోవలసి ఉంటుంది. ఉదాహరణకు, భారతదేశానికి వచ్చిన సినిమా కళాకారుల ప్రతినిధివర్గంలో సభ్యురాలుగా ఉండిన ఒలెగ్ జబోత్కినా వృత్తిరీత్యా నృత్యనాటకాలలో నర్తకిగా ఉండేది. ఆమె "ఇద్దరు కెప్టెన్లు" అన్న చిత్రంలో కాత్యా తతరినోవా పాత్రను వహించడానికి ఆహ్వానింప బడింది. ఎందువల్లనంటే ఆ చిత్రానికి ఆధారమైన నవలలో కథానాయిక వర్ణన అన్నివిధాలా ఆమెకు సరిపోయింది.

ఈవిధంగా నటులను ఏరుకొనే సందర్భంలో సినిమాస్టుడియోల నటులశాఖవారు ఔత్సాహిక నాటకబృందాలనుకూడా పరిశీలిస్తూ ఉంటారు. ఇప్పుడు సినిమారంగంలో ప్రఖ్యాతిగాంచిన సినిమానటులలో అనేకులు అలాంటి ఔత్సాహికనాటకబృందాల్లోంచి వచ్చినవారే. సినిమానటులు పెర్జిస్తాల్యరోవ్, పావెల్ కదోచ్నికోవ్ అలాంటివారే. వీరు భారతీయ ప్రేక్షకులకు సుపరిచితులే.

వేరేవృత్తులవారు సినిమాలలో నటించడానికి ఆహ్వానింపబడిన సందర్భాలుగూడా

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at
The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad



చుట్టాలింటికి

—ఫొటో: డి. వి. ఎస్. ఎస్. ఎస్. సోమయాజులు.

Regd. No. M. 4479 Andhra Patrika Illustrated Weekly